శ్రీకృష్ణపరమగురుభ్యోనమః.

శ్రీ వెలుగోటి

సర్వజ్ఞ కుమార యాచేంద్ర భూపాల

విరచితంబైన

# సర్వమతసారసంగ్రహము

అను గ్రంథము

ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాల

యందు ముద్రింపించి

ప్రచురింపంబడియె.

చెన్నపురి.

౧౮౮౫ సం॥

శ్రీరస్తు.

శ్రీకృష్ణపరమగురుభ్యోనమః.

# —* సర్వమతసారసంగ్రహము. *—

మనస్వాత్య్య మతసిద్ధాంతప్రకారముగ జగత్కర్తయైన దేవు డున్నాడని చెప్పెడు మతములలో గొన్నికొన్ని భాగములు న్యాయ్యములైనవి గాకపోయినను ఆస్తికమతము లనంబడుచున్న వనియు జగత్కర్తయైన దేవుడు లేడని గాని లేక యొక శూన్యమైన యాకాశమువలె నొక నిర్గుణబ్రహ్మం బున్నదని గాని స్వభావమే కారణమనిగాని చెప్పెడు నిట్టివి నాస్తికమతము లనంబడుచున్న వనియు వ్రాసితిని ఈ సర్వ మతములలోను కొన్ని కొన్ని సారములైన సంగతులు లేక ప్రజలు అంగీకరించరు యుగ మువలన నాకు సాధ్యమైనమట్టుకువివరించి చూచిన మతములలో ఐహికాముష్మికములకు అనుకూలములై సారవంతములగుసంగతులు యీక్రిందవ్రాయుచున్నాను.

ఏల నంటే మధుమక్షికము సమస్తపుష్పముల నుండు సారము గ్రహించినట్లు బుద్ధిమంతులు పక్షపాత

బుద్ధిలేక సర్వమతములలో సారములను గ్రహించి వై హికాముష్మికములలో లోపములు రాకుండ బ్రవర్తించు టముఖ్యము కాబట్టి యిట్లు వ్రాయ బూనితిని.

## —* శాంకరవిద్యారణ్యాద్వైతమతములు. *—

హిందూవేదమతానుసారములైన అద్వైత విశిష్టాద్వైత ద్వైతములలో జేరిన శాంకర విద్యారణ్యాద్వైతమతములలో నేయుపయోగంబును లేని యాకాశమువంటి యొకశూన్యప్రాయమైన నిర్గుణనిర్విశేషచిన్మాత్ర బ్రహ్మమున్నదనుచు దానే బ్రహ్మంబనియు ॥ బ్రహ్మసత్యం ॥ జగన్మిథ్యా॥ యనియు అద్వైతులు చెప్పుచున్నారు- ఇది చూడగా నేయుక్తియులేక గురువులకు శిష్యులకును దెలియని మతముగానున్నది.

ఎట్లనగా జగత్తు మిథ్య యనగా రజ్జు సర్పభ్రమవంటిది ఈజగత్తు అని చెప్పుచున్నారు ఆపక్షములో బ్రహ్మమునకేగదాభ్రమగలిగి జీవత్వముగల్గవలెను- ఇతరపదార్థ శూన్యుడై సత్యజ్ఞానానంద స్వరూపునికి భ్రమయెట్లు గలుగునని యడిగితే చెప్పువారికిని వినువారికిని యుక్తికిరాని మాటలు చెప్పెదరు అట్లుండినను ఇందలి సారాంశము లెవ్వి యనగా.

## —* అద్వైతమతసారము. *—

జగత్తు సర్వము మిథ్య యనగా వంధ్యాపుత్రుని వంటివి దనుటవలన నట్టినిశ్చయము గలవారికి లౌకికదుఃఖాదులు గలిగినప్పుడు విషయములు మిథ్యలను నిశ్చయమువలన కొంతదుఃఖపరిహారము కావచ్చును - మఱియు జీవబ్రహ్మైక్యానుసంధానము సేయుట యని వారువ్రాసియుండు షడ్విధసమాధులలో నిర్వికల్పామనస్క సమాధియందు చిత్తైకాగ్రత వలన నిద్రాప్రారంభము వంటి యొకసుఖము గలుగుచున్నది. ఈసుఖము చిత్తవిశ్రాంతి హేతువగుచున్నది. ఇందుకు సీతారామాంజనేయము
గ్రం ॥ గీ ॥ సంతసము మీఱ చిత్త విశ్రాంతి కొఱకు।
సతత మాత్మ సమాధి గోరితివి గాన । గడగి యమన
స్క రాజయోగంబు నీకు । దెలియ జెప్పెద వినుము
సందేహముడిగి ॥ అనియున్నది.

అయితే అద్వైత మత సంకేతమును బట్టి యిదే మోక్షమని చెప్పెదరు- దానితో ప్రయోజనములేదుగాని చిత్త విశ్రాంతి సుఖము గలుగుచున్నది.

ఇవే యిందలిసారాంశములు.

## —* విశిష్టాద్వైతమతము. *—

బ్రహ్మము చిదచిద్విశిష్టము యిందువలన జగత్తునకు అభిన్ననిమిత్తోపాదానకారణ మనియు జగత్తు సత్యము నియు యిందులోచేరిన రజ్జుసర్పభ్రమయు స్వప్నప దార్థంబులును సత్యములనియే విశిష్టాద్వైతులు చెప్పు చున్నారు.

జగత్తు సత్యమనుటలో బ్రహ్మము చిదచిద్విశిష్టము గనుక విశేషణములయిన చిదచిత్తులు నిత్యములు గానుం డవచ్చును గాని చిద చిన్మిశ్రము లగు పదార్థరూప నామములు వస్తువులు పుట్టుటకుముందును, నశించినపిద పను, లేనివిగానరూపనామములు నిత్యము లెట్లు.

మఱియు రజ్జుసర్పభ్రమము సత్యమెట్లగును అది సత్యమైతే భ్రమయను వ్యవహార మెట్లు గలుగును మరి యు స్వప్నపదార్థంబులును మనఃకల్పితము లావునే యువిసత్యము లెట్లగును అట్లయ్యెడి పక్షములో మనము మనోరాజ్యము లనుభవించినట్టుగా తలచితే యాపదా ర్థములు సత్యము లగునా మరియు బరిపూర్ణ బ్ర హ్మమునకు బరిచ్ఛిన్నరూప కల్పన లోక కల్పనాదులు చే యుచున్నారు ఇట్లు అనేకలోపము లున్నను ఇందలిసా

రాంశము లెవ్వియనగా.

## —* విశిష్టాద్వైతమతసారము. *—

జగత్తు బ్రహ్మమునకు విశేషణముగా నున్నందున జగత్తు బ్రహ్మమువంటి సత్యమని చెప్పినను బ్రహ్మంబును తద్విశేషణములయిన పరాపర ప్రకృతులును నిత్యములు గావచ్చును గాని వాటి మేళనము వలన గలుగు రూపమును తత్ప్రియుక్తనామమును భ్రమయును స్వప్నమును నివి సత్యము లగునా ఇది సరిగాక పోయినను బ్రహ్మము చిదచిద్విశిష్ట మని చెప్పుట వలన కారణానవస్థ పోవుచున్నది.

ఎట్లనగా జగత్తుకు ఉపాదానకారణ రూపమయిన ప్రకృతియను నన్యపదార్థమున్నదను నెడల బ్రహ్మముకంటె నపకృష్టమగు పృథక్పదార్థమున్నప్పుడు ఉత్కృష్టపదార్థమేలయుండగూడదు - ఇదియుక్తిచేతసిద్ధించుచున్నది.

మరియు నట్లు బ్రహ్మమున కంటె నపకృష్టమయిన పృథక్పదార్థమున్న యెడల దానికి కారణము బ్రహ్మము కావలసివచ్చును కార్యమును జూచి దీనికి వేఱైనకారణముండవలసి నప్పుడు మనము జూచుపదార్థములు అన

గా స్థావర జంగమములు స్థావరములయిన వృక్షాదుల
కు బీజభూతమయిన మఱియొకవృక్షమును దానిబీజము
ను ఉండవలెను దానికి కారణమయిన మరియొకవృక్ష
ము దాని బీజముండవలెను.

ఇట్లు అనేక పరంపరా కారణము లుండవలసి యు
న్నది. జంగమములయిన మనుష్యాదులకు గూడ కుమా
రునికి కారణమయిన తండ్రియుండవలె ఆతండ్రికి కార
ణమైనవానికి తండ్రియుండవలె ఇట్టు లనేక పరంపరా
కారణము లుండవలెను ఈదృష్టాంతమువలన బ్రహ్మము
నకు మరియొక కారణము ఆకారణమునకు మరియొక కా
రణము ఉండవలెను, ఇట్లు కారణానవస్థ గల్గును ఆప
క్షమునకు ఆదికారణము బ్రహ్మమొక్కడేయనుటకు వ
లను లేకపోవును గాబట్టి బ్రహ్మము చిదచిద్విశిష్ట మని
యు దనకు విశేషణములైన చిదచిత్తు లుపాదాన కా
రణము లనియు విశేష్యము నిమిత్తకారణ మనియు నుం
డుటచేత కారణానవస్థ కలుగ జాలదు. ఇందు వలన
చిదచిద్విశిష్ట బ్రహ్మంబు ఒక్కడె యగుట వలన సృష్టిం
చుటకు నుపకరణ సామగ్రియుం బనిలేదనియు నేపడ
చుచున్నది.

ఇవి యిందలిసారాంశములు.

## —❊ ద్వైతమతము. ❊—

బ్రహ్మము నిమిత్తకారణము చిదచిత్తులు భిన్నపదార్థములు నిత్యములు, ఇవి యుపాదానకారణములు బ్రహ్మము విశేషణవిశేష్యభావము లేక కేవలము బ్రహ్మాన్ని పృథక్కుగా నుండువాడు అనిద్వైతులు చెప్పుచున్నారు ఇట్లగుట వలన బ్రహ్మంబునకు బరిచ్ఛిన్నతయు నిందు వలన సర్వశక్తిలోపత్వమును జగత్కారణత్వా సిద్ధియును గలిగి కారణానవస్థాప్రసంగమును సంభవిల్లును-అట్లున్న ను ఇందలి సారాంశము లెవ్వియనగా.

## —❊ ద్వైతమతసారము. ❊—

బ్రహ్మంబు జగత్తునకంటే వేఱయినవాడుగాను పరిచ్ఛిన్నుడుగా నుండువాడుగా జెప్పుట వలన మందబుద్ధులకు నొకమహారాజ దృష్టాంతముగా నుంచుకొని భక్తి సేయుటకు రూపాలంబన సౌకర్యము గలిగియున్నందున యుక్తముగా నున్నది.

ఇదియే యిందలి సారాంశము.

## —❊ మహమ్మదీయమతము. ❊—

జబ్బూరు, తౌరైత్, ఇంజీలు, ఖురాను, ఈవేదములను భగవంతుడు అప్పుడప్పుడు నొకటి వెనుక నొకటి

గా పంపినాడని మహమ్మదీయులు చెప్పుచున్నారు.

ముందొకటి పంపి తత్వములను ఖురాను మొదలైనవి మార్చి వేఱు పుస్తకములను బంపుట పూర్వముతాను బాగా దెలియక చెప్పినట్టుగాగాని పరస్పర మతవిరోధములచేత జనులు చావవలె ననిగాని అవివేకము వలనగాని వెనుక వెనుక పుస్తకములను బంపి యుండవలెను. ప్రతిదానియందును కాఫర్‌ను చంపుమని యున్నది. కాఫర్ అనగా తమ మతములో జేరనివాడు- ఇట్లున్నందు వలననె దావూద్ పైగంబరీలో వచ్చిన జబ్బూరు పుస్తకమునకు వ్యతిరేకముగ నడచిన యేసుక్రీస్తును అనగా యీసాపైగంబరును దావూదుపైగంబరు మతస్థులు అన్యా యహూదులుచంపిరి.

ఇట్లు తండ్రియైన దేవుడు ఒకరినొకరు చంపుకొనుటక నిట్టి పుస్తకములంపునా మరియు ఖురానులో కియామత్ అనగా మహాప్రళయము అప్పుడు గోరీలలో పూడ్చ పెట్టబడిన మనుష్యులను లేపి పుణ్య పాపములు విచారించుసమయమునందు మహమ్మదు సిఫారస్ చేసినవారి పాపములను మన్నింపు చేస్తాడనియు తక్కినవారికి నే నియు వ్రాయబడియున్నది.

దేవుడు సర్వజ్ఞుడుగానుండునపుడు ఎవరు పుణ్యాత్ము లైనది ఆయనకు తెలియనట్టేగదా యితరమతస్థులు నెంతపుణ్యాత్ము లైనను రక్షించకపోతే దేవుడు పక్షపాతి కదా.

మరియు నొకలక్షయెనుబదివేల పయగంబర్లు అయినారనియున్నది భూమినిపుట్టించి షుమారు అయిదువేల సంవత్సరములైనట్లు అందులోనేయున్నది యిందలి కాలసంఖ్యావిరోధము చూడుడు యిందరు పయగంబరీలలో "లాయిలా యిల్లిల్లా" అని యొకటే కల్మా చెప్పినట్లు ఖురానులోనున్నది.

యిందుకు అర్థము "లేదుఅల్లా శివాయ అల్లాకంటే "అని చెప్పబడియున్నది మరియు నేది యారంభించునప్పుడును "బిస్మిల్లా యిర్రిహామా నిర్రిహీం అని చెప్పి ఆరంభించుమని చెప్పబడియున్నది దేవునిపేరు చెప్పి ఆరంభించుమనియర్థము. ఈరెండువాక్యములలో దేవుని ప్రథమపురుషముగా చెప్పబడియున్నది ఖురాను దేవుడు చెప్పిపంపించితే తన్ను ఉత్తమపురుషముగా చెప్పవలె గాని ప్రథమపురుషముగా దేవుడెట్లు చెప్పను ఇందువలన ఖురాను దేవుడుపంపించినదికాదు అయితే యిట్లనే అందఱి వేదములలోను ప్రథమపురుషముగా జెప్పబడి యుండలే

దా అనివారు చెప్పుచున్నారు అందరి వేదములు ఆయా మతస్థులు కల్పించినవే గాని దేవుడు చెప్పిపంపించినవిగా వని చెప్పేమామీదయీయాక్షేపమురాదు. ఈవిషయము దయానందసరస్వతీవిరచిత సత్యార్థప్రకాశికలో, ౧౪, వ,యుల్లాసము మొదల ఖురాను ఖండనములో జూడుడు.

ఇందులోనుండువ్యత్యయములవలన అర్థములు వేరు వేరు జేసి యీవలివారు అనేకమతములు కల్పించిరి.

అట్లుండినను, ఇందలిసారాంశము లెవ్వియనగా.

—* మహమ్మదీయమతసారము *—

అన్నిటికి ముఖ్య కారణమగు దేవుడే నమస్కార యోగ్యుడు కాబట్టి యితరులకు సిష్దా చేయగూడదనుట అనగా దండము వెట్టకూడదని యర్థము సర్వకర్తయు సర్వసాక్షియు సర్వఫలప్రదాతయు భగవంతుండే కాబట్టి భగవంతునికంటె నపకృష్టులగు వారు నమస్కార యోగ్యులు గారు అట్లు నమస్కార యోగ్యులయితే భగవంతునికి సమానులుగ జేయ బడిన వారగుదురు. ఇట్లుభగవంతుడే నమస్కరణీయు డనుటకు నిదర్శనముగా అథర్వ శిఖోపనిషత్తులో "కారణంతుధ్యేయః" అని యున్నది. మనుష్యులకు జేయు వందనాదుల విషయమైకూడ ॥ మఱియు భాగవతమునందు ॥ సాంబశివుడు

పార్వతికి జెప్పుచోట ॥ శ్లో ॥ ప్రత్యుద్గమ ప్రశ్రయ ణాభివాదనం విధీయతె సాధు మిథ స్సుమధ్యమే । ప్రా జ్ఞైః పరస్మై పురుషాయ చేతసా గుహాశయాయైవ న దేహ మానినే ॥ అని యున్నది. అనగా వందనాదులు గుహాశయుడైన అంతర్యామికి జేయువలసినదేగాని దేహా భిమానియైన జీవునికి జేయగూడదనుట.

మఱియు బ్రతికిన వారిని గురించి యిహ పరములందు మేలు గలుగవలెననిగాని చచ్చినవారికి పరములో మేలు గలుగవలెనని గాని అభిప్రాయముంటే భగవత్ప్రీత్యర్థ ముగ మనుష్యులకు అన్నవస్త్రాది దానముచే తృప్తిచేసి దానివలనగలుగు సవాబు అనగా ఆపుణ్యము దానివలనగ లుగు భగవత్ప్రీతికి ఫలంబై చెప్పినవారికి తానుద్దేశించిన మేలును గలుగజేయుమని దేవునించాప్రార్థించవలయు నని యున్నది. యిది సరియైనది. ఎట్లనగా చచ్చినవారికి ప్రీ తిగా శ్రాద్ధాదులుచేయుటగాని యితరదేవతలనుద్దేశిం చి నైవేద్యాదులు చేయుటగాని ప్రయోజనకరముగా దు చచ్చినవారు పిండప్రదానములు గ్రహించుట యబద్ధ ము కాబట్టి యిందుకు పైత్రుకకర్మాంతమునందు "స ర్వం శ్రీజనార్దనఃప్రియతాం" అని చెప్పబడుచున్నది. మరియు ననేక దేశములలో ననేకులు తమ తమ యిచ్ఛ

ర్లడి తలచి పేరుపెట్టబడిన పరిచ్ఛిన్న దేవతలుండు
డల అనంత దేవత లుండవలసివచ్చును అట్లుండినను దేవు
వలె బరిపూర్ణులు గారు గనుక అనేక దేశములలో
కకాలమందు వారువారు నిచ్చు నైవేద్యము లెట్లుభక్షిం
తురు వారివారి యుద్దేశ్యములు తెలుసుకొని ఫలము
ట్లిత్తురు, ఆదేవతలు పరిపూర్ణులే యంటే జగత్తుకు
అనేక ఈశ్వరులుగా నేర్పడ వలసి వచ్చును. అనేక ఈ
శ్వరులైతే సముద్ర ఋతుకాలాది నిర్ణయములును.
స్థావర జంగమాదులధర్మములు ఏకరీతిగ నడువక పో
వలసివచ్చును ఎట్లనగా ఒకరాజ్యములోననేక రాజులుం
టే భిన్నభిన్నాభిప్రాయములచేత వ్యత్యస్తములు గలిగిన
ట్లు వ్యత్యస్తము గలుగును. ఆదేవతలు నైవేద్యపదా
ర్థములు వారు భక్షించితే ఆనైవేద్యపదార్థములిక్కడనే
యున్నవే వారలెట్లుభక్షించిరి- లేక అందలిసారము గ్ర
హించిరంటె నివేదింపక ముందున్న రుచి నివేదనానం
తరంబును గలిగి యున్నది- కాబట్టి దేవత లుండుటయే
యబద్ధము.

దీనివలన జగత్కారణంబును జనకుండు నయిన దే
వునికి బిడ్డలగు మనుష్యులకు దృష్టిసేసి దానం గలుగు
భగవత్ప్రీతిని బట్టి పైజెప్పినవారికే గాని తనకు గాని మేలు

గలుగ వలెనని దేవునిం బ్రార్థించుట న్యాయ్యమైనది గానున్నది. మఱియు ననేకమతములలో మద్యసేవనాదు లు కొన్నికొన్ని సమయములయందును గొన్నికొన్ని కార్యములయందును కొన్నికొన్నిజేయవచ్చు నని చెప్పబడి యున్నది. యీలాటివి అనగా నేవిధములయిన కైపుప దార్థములు ఎప్పుడును సేవింప గూడదని నిషేధింపబడి యున్నది. ఎందువల్లనంటే కామక్రోధాదులవలన నన ర్థములు గలుగకుండ చక్కజేసి కొనుటయు నిహలోక పరలోకములకు గావలసిన మంచి కార్యముల జేయు టయు దుష్కార్యముల మానుటయు నిట్టి వాట్లకు బుద్ధి, ప్రధానసాధనము. నిషాయనునది బుద్ధిని ముందుగా జెఱచునదియు మరిగిన బుద్ధిని గష్టతరముగా నైనను తిరు గనియ్యనిదియు గావున నెంతమాత్రము కైపుచేయుగూడదనుట. యివియే యిందలి సారాంశములు.

## —* క్రైస్తవమతము. *—

ఏసుక్రీస్తు తనభక్తుల పాపములకు బదులుగా సిలువలో తానుకొఱత వేయించుకొని తనరక్తముచు చిందించెననియు దేవుడు పరిశుద్ధుడు పాపముచేసినవానికి దగినశిక్ష వానికే సేయక మానడనియు పరస్పర విరుద్ధముగా క్రిస్టియన్లు చెప్పుచున్నారు.

ఎట్లనగా, అనేకులదోషములకు బదులుగా నొక్కని దేవుడు శిక్షించు నెడల దేవునికి స్వోక్తివిరోధము రాదా ఒక్కనికి ఏకవిధశిక్ష సేయు టవలన నందఱియొక్క నానావిధపాపములెట్లు నశించును లోకమునందు అధికారులు యెవడుతప్పు చేయునో వానినె శిక్షింతురుగాని వానికి బదులుగా మఱియొకనిని శిక్షించుటగాని యనేకదోషములకు నొకే శిక్షగాని చేయుట లేదు. ఇట్టి విరుద్ధములనేకములున్నవి. ఈవిషయములు మేము వ్రాసిన హింధూమతవిరోధభంజనిలో జూడుడు. ఈలాటి విరోధముల వలన వారివారికి తోచినట్లు అనేకమతములు అందులో కల్పించిరి.

ఇట్లుండినను. ఇందలి సారాంశము లెవ్వియనగా.

—* క్రైస్తవమతసారము. *—

పరిశుద్ధాత్మ నిర్గుణుడు దయాదిగుణములులేని వాడు గావున నిర్గుణబ్రహ్మంబు నుపాసించుటవలన నుపయోగములేదు దయాదిగుణములుగలిగి రక్షకుడును త్రిత్వైక దేవుడును దేవునికుమారుడునగు ఏసుక్రీస్తునునమ్మి వారు చెప్పిన పదియాజ్ఞలప్రకారముగా నడుచుచు జ్ఞానస్నానము రాత్రిభోజనమును జేసితె ఆయనరక్షించుటకు వీనిపా

పములు తానువహించి ముక్తినిచ్చుచున్నాడని చెప్పుచు న్నారు ఇదియోచించగా అద్వైతులు బ్రహ్మంబు నిర్గుణంబు ఆబ్రహ్మంబె మాయోపహితమై సగుణబ్రహ్మంబగుచున్నాడు అతడు దయాదిసకల కళ్యాణగుణములుగలవాడై ప్రపంచమును సృజించుచున్నాడనియు జెప్పుచు న్నారు.

ఇదినిజమైనయెడల దయాదిగుణవంతుడునగు వానినే యుపాసించవలసినది గానదీనికనుగుణముగా క్రిష్టియన్లు చెప్పునదియు యుక్తముగనున్నది మరియును అన్నాదులిచ్చుటకు నందఱుపాత్రులేయని బహుమతస్థులు చెప్పిన రుగాని క్రిస్టియన్లుమాత్రము అందఱకుబెట్టగూడదు అని చెప్పెదరు. ఏవిధమైన వృత్తివలనను జీవింపజాలనివారికిఅన్నాదులుయిచ్చితే వారికిజీవనోపయోగమై తండ్రియగుభగవంతునికి ప్రీతిగలుగునుగాని బలమును అవయవపాటవమును గలిగి వృత్తిజేసికొని జీవింపగలవారికి నిచ్చితేఆరోగదృఢగాత్రులైనందువలనను తమతమవృత్తివలన గష్టముగలిగి మదముదగ్గనందువలనను దుర్విషయములమరుగుటయెగాక కష్టపడి సంపాదించుట అనుభవమున లేనందున లోకులను మిక్కిలిగాబీడించి యిచ్చినవానివిషయమందు యింతేనా యిచ్చెదియనియతృప్తిపడి

యివ్వని వాటినిదూషించి యిట్లుసంపాదించినది కలువు కాలములకొరకు దాచక మద్యపాన జారత్వాది దుర్వి షయములలో నుపయోగించు చున్నారు

ఇట్టివారి కిచ్చిన వారును ఈదోషములకు భాగస్థు లగుదురు గాన ఏవృత్తియుంజేసి జీవింప జాలనివానికిద ప్ప నితరుల కన్నాదు లీయగూడదనుట సరియైనది గా నేయున్నది.

ఇవే యిందలి సారాంశములు.

## —✻ జైనమతము ✻—

దేవుడులేడనియు జీవుడే మంచిపనులు చేయుటవలన దేవుడగు చున్నాడనియు జైనులుజెప్పుచున్నారు జగ త్కర్తయైన దేవుడు లేకయే యెట్లుజనంతట యీజగ త్తు గలుగును మంచిది దేవుడు లేనప్పుడు జీవుడు దేవుడ గుట యెట్లు అట్లగుటకు దేవుడె యజ్ఞానోపాధి వలన జీవుడు గానై యుండవలెను లేక మంచికార్యముల వలన నే జీవుడు దేవుడగు నెడల అనేకదేవుళ్లు గావలయును. అట్లువిరుద్ధములున్నను ఇందలిసారాంశము లెవ్వియనగా.

## —✻ జైనమతసారము. ✻—

పూర్వమీమాంసామత సూత్ర కర్తయైన కర్మక్రి

ష్టావాదియైన జైమిని మతమును ప్రకాశింపజేసిన భాట్ట ప్రాభాకరులు కర్మమే దైవమనియు సత్కర్మములు చేయుటవలన జీవునికి నుత్తమగతులు గలుగుచున్నవని యు జెప్పుటనిజమైతే పైన జెప్పినసంగతులు యుక్తములైన వేను - అట్లుకాకపోయినను సత్కార్యములు చేయుట యావశ్యమని చెప్పుటవలన లోకోపకార మగుచున్నది - మఱియు "అహింసాపరమోధర్మః" అని వారలేవిధమైన హింసయు చేయరుదీనివలన దేవుడున్నపక్షమందుఏవిధమై నభూతహింసవారుచేయనందునను లోకోపకారము చే యుటవలనను కడమసంగతులలో దప్పుండినను వారిని దే వుడు రక్షించుచున్నాడు లేక దేవుడులేనిపక్షమందును భూతహింసచేయక లోకములో మంచివాడని పించుకొ నుచున్నాడు.

ఇవే యిందలిసారాంశములు.

## —* నాస్తికమతము *—

ప్రత్యక్షప్రమాణము మాత్రమె యొప్పిజగదనుమాన ప్రమాణంబుచేత సిద్ధించెడు జీవేశ్వరులను ఒప్పక యీ లోకములో దమకు రాజెవ్వడో వాడే పరమేశ్వరుడని యు రాజదండనకు మాత్రము భయపడవలయుననియు

వేఱే దేవుడు లేడు జీవుడనువాఁడు లేడు ఆకాశము గాక తక్కిన నాలుగు తత్వముల సంఘాతమగు శరీరములో గలుగు వృద్ధిజ్ఞానాదిగుణములను జూచి జీవుడుగా నితరులు తలచెదరు ఈశరీరము శిథిలితము కాగానే ఆగుణములు నశించి నిరుపయోగమై పోవుచున్నది కాబట్టి దేవుడు కలడనియు నసత్కార్యములు చేసితే లోకాంతరమందు జన్మాంతరమందు దేవుడు శిక్షించు ననియు భయపడక నున్న సమస్తము దైవాధీనమని తమతమ యత్నలోపములు చేసికొని కార్యములు చెఱచుకొనకుండ పూర్ణప్రయత్నము చేసి కార్యసిద్ధులబొంది కావలసినట్లు సుఖము లనుభవించుటయే ముఖ్యకార్యము అని లోకాయతికులు జార్వాకులు - బ్రాడ్లా - సైమ్సు మొదలగు - నాస్తికులు చెప్పుచున్నారు - ఇందులోననేకములు ప్రత్యక్షానుమానప్రమాణవిరుద్ధములు అనుభవ విరుద్ధములు యుక్తివిరుద్ధములునున్నప్పటికిని- యిందలిసారాంశములెవ్వియనగా.

## —*నాస్తికమతసారము*—

పైనవ్రాసిన హేతువుల వలన లౌకిక కార్యములయందు బూర్ణప్రయత్నము చేసి కార్యసిద్ధులను బొందుటయు సుఖము లనుభవించుటయు రాజభయము వల

వ దుష్కార్యములు చేయకుండుటయు నివే ఇందలి సా రాంశములు-

—✻ ఆర్యమతము ✻—

ముక్తి జెందినవారు మరల జన్మింతురు ఇట్లు ముం డకోపనిషత్తులో ముక్తజీవులు మహాకల్పము దాక ము క్తిసుఖము ననుభవించి తిరుగ సంసారములోకి వచ్చు న ట్లున్నది-

మరియు వేదమునందు మంత్రభాగము దశోపనిషత్తు లు తప్ప, కడమ బ్రాహ్మణభాగము, ఉపనిషద్భాగము, ప్రమాణము కాదు - బ్రహ్మాస్త్రవారుణాస్త్రాదులువా ట్లరీతిని బట్టి పూర్వము పేరుపెట్టిరే గాని ఆగ్నేయాస్త్ర ముకాల్చునదియైతె ముందు మంత్రించువారి నోరు కాలి గదా ఆవల శత్రువును కాల్చవలసినది అని మంత్రభా గమందును ఆక్షేపించుచున్నాడు - ఇదిగాక ఉపనిషత్తు లలో - సత్తు - అసత్తు - ఆత్మ - బ్రహ్మము - ఇవి యివి ముందుండెనని యున్నందున ఈనాలుగు అనాదు లుగా నుండెననియు - ఆర్యమత కర్తయైన దయానం ద సరస్వతి వ్రాసిన సత్యార్థప్రకాశికలో ౧౨ వ ఉ ల్లాసముకొనన వ్రాయబడి యున్నది - పైనాలుగు తత్వ

ములు నిత్యములై భిన్నములుగా నుండు నెడల బ్రహ్మము నకు పరిమితియు సర్వశక్తిత్వ సర్వసాక్షిత్వాది లోపం బులును గలుగును బ్రహ్మం బొకఁడనుట యేర్పడ నం దున కారణానంత్యము గలుగును - ఇట్లనేక విరుద్ధము లున్నను ఇందలి సారాంశము లెవ్వి యనగా-

## —✻ ఆర్యమతసారము ✻—

బ్రహ్మమునకు రూపము లేదు పరిచ్ఛిన్నుఁడు గాడు పరిచ్ఛిన్నుఁడైతే తచ్ఛక్తులును పరిచ్ఛిన్నములు కావలసి వచ్చును - కాబట్టి భగవంతునికి రూపకల్పనచేసి పూ జాదులు చేయుట సరిగాదు - సగుణ నిర్గుణ స్తోత్ర ములు చేయవలసినది - భూతహింసాదులు చేయక సత్యముగా నుండవలయును సగుణస్తోత్రమనగా దయా ది కళ్యాణ గుణములు గలవానిగా నుతించుట. నిర్గుణ స్తోత్రమనగా అజ్ఞాన రోగ మరణ పరిచ్ఛిన్నక్రోధాది గుణములు లేనివానిగా నుతించుట - మఱియు వేదోక్త పశుహింసాది యజ్ఞముల తాత్పర్యము హింసచేయుమ నుట కాదు - పశుహింసాదులు సేయుట యాసుర కృ త్యము.

ఇంతేగాక జగదనుమాన ప్రమాణనిర్ణేయుఁడగు భ

గవంతుడు సర్వవ్యాపకుడు అట్లు కాడెని - సర్వాంతర్యామియు, బరిపూర్ణుండు, సర్వజ్ఞుండు, సర్వనియంతయు, సృష్టికర్తయు, సర్వభర్తయు, సర్వనియామన పాలకుండు, ప్రళయకర్తయు, సర్వసాక్షియు, సర్వఫలప్రదాతయు, నెట్లగును - మఱియు జ్యోతిశ్యము పిశాచములు, మంత్రములు, దేవతలును, అబద్ధము. యజ్ఞాదులు చేయుటచే ఆధూమాదులవలన వర్షోత్పత్తి గలుగుచున్నది.

మహామ్మదీయమత వేదమగు ఖురానులో నచ్చటచ్చటనీయీ విధముగా పరస్పర విరుద్ధము లున్నవి, మఱియు జీవుడు స్వతంత్రుడు వాడు తనచేసిన పుణ్యపాపకర్మముల ఫలములదాననుభవించుటయందు భగవంతునికి బరతంత్రుడుఅనగా దేవుడుజీవునికి కరణకళేబరములనుస్వాతంత్ర్యమునునిచ్చుచున్నాడుజీవుడుతనస్వతంత్రతవలన జేసికొన్నకర్మములకు దేవునివలన ఫలభోక్త యగుచున్నాడే గాని వాని స్వాతంత్ర్యముచే జేయు కార్యములకు అంతర్యామిప్రేరణ యావశ్యకములేదు - మఱియు కర్మమే ఫలము నిచ్చుచున్నదని కొందరు చెప్పుదురు - అట్లుగాదు - కొన్నికర్మములకు ఫలము పుట్టకుండుటచే తకర్మ ఫలములను గర్మమేయీయఁడు. పురుషపుకర్మనుచే

యుటవలన ఫలప్రాప్తిగలుగదు - ఇందువలన ననుమా నప్రమాణముచేత కర్మ ఫలప్రాప్తి యీశ్వరాధీనమని తోచుచున్నది ఇట్లుండు దానికి స్వభావ వాదులు పదార్థముల సంయోగమువలన సున్నము పసుపు నిమ్మఫలుసు కలుపుటవలన నెరుపురంగు గలుగలేదా యనియంటె యవితమంతట నిట్లు మేళనమై కలుగజాలవు మనుష్యుడు శక్తద్భాగముల ప్రకారముగ గలిపితేనే గానితమంతట కాజాలనట్లు యీశ్వరుడు సంయోగము చేయుటముఖ్యావశ్యకము కాబట్టిదేవుడు జగత్తుకుకర్త.యితనింగీర్తించుటయే ముఖ్యము - ఋగ్వేదము ౨౪ సూ, ౧ మంత్రమునందు మోక్షముజెందిన వారిలో నెన్నవ వాడ నశుదునో మనోజ్ఞమైన దేవునియొక్క నామమును మననము సేయుచున్నాను, అని యిట్లు ఆర్యమత సిద్ధాంత గ్రంథమగు సత్యార్థ ప్రకాశికలోనున్నది.

ఇవే యీమతములో మిగుల సారాంశములు.

## —※ సాంఖ్యమతము. ※—

ప్రధానము, పురుషుడు, అనుతత్వములు రెండు. పురుషుడు నిర్గుణము. ఈప్రధానము జడము దీని క్షోభమువలన నానావిధ తత్వములు గల్గి పాంచ భౌతిక

శరీరము గలుగు చున్నది.

ఇందువలన లోక వ్యవహారాదులు గలుగుచున్నవి - పురుష సాన్నిధ్యము వలన నంతఃకరణమునకు జ్ఞానాజ్ఞాన సుఖదుఃఖాదులు గలుగు చున్నవి - ఆయంతః కరణ సాన్నిధ్యమే - పురుషునకు బంధము - అంతఃకరణ బంధము వీడుటే మోక్షము - అని సాంఖ్య మతస్థులు చెప్పుచున్నారు. అచేతనమైన ప్రధానమునకు క్షోభము తనంతట నెట్లు గలుగును - అచేతనము లగు మృజ్జలములు కులాలాపేక్ష లేకయే మిశ్రములై ఘటంబుగ నెట్లగును - ఇట్లు చేతనాచేతన మిశ్రిత ప్రపంచము భగవన్నిరపేక్షముగ నెట్లు కాజాలును.

ఇట్టి యుక్తిలేని సంగతులు పెక్కు- లుండినను ఇందలి సారాంశ మెద్ది యనగా.

## —* సాంఖ్యమతసారము. *—

౨౪ తత్వములతో జేరిన శరీర తత్వములనున్ను నిర్గుణమయిన జీవ తత్వమునున్ను, చక్కగా వ్రాసిరి.

అనేక మతస్థులు ఈసాంఖ్య తత్వ నిర్ణయమునే యంగీకరించిరి - ఇదియే యిందలి సారాంశము.

౭ తత్వములు, ౧ స్థూలరూపము, ౨ ప్రాణము, ౩ లింగశరీరము, ౪ కామరూపము, ౫ మనస్సు, ౬ బుద్ధి, ౭ ఆత్మ, ఇవి వేఱువేఱు కావు స్పిరిట్ అనగా ఆత్మ, మెటర్ అనగా ప్రకృతి, ఈయేడును ఆత్మయొక్క పరిణామ భేదములు లేక ప్రకృతి పైపై అంతస్థులు. అనియుం జెప్పవచ్చును. యివియే కాలక్రమవృద్ధిచేత తమంతట నవి హెచ్చు తరగతులకు బోవుచున్నవి. యోగులు లింగశరీరముతో బహుదూరము కనుపడు చున్నారని చెప్పునప్పుడు మనస్సుయొక్క యంశము కామరూపముతో వచ్చుటయే యగును - హిమాలయ మందుండు యోగులు మాతో మాట్లాడుచున్నారు. మీయొద్దకు వచ్చిన రోగులను అరోగులనుగా జేయుండని ఆయోగులు మాతో సెలవిచ్చిరి, మేము రోగుల రోగములను గుదుచుచున్నాము. అని యిట్లు - తియాసఫిస్టు మతస్థులగు మేడం బ్రావిడ్స్కీ, కర్నల్ ఆల్కాట్, మొదలగు ప్రధానులగువారు చెప్పుచున్నారు. తత్వములు తమంతట హెచ్చునకు వచ్చు పక్షమున పురుష ప్రయత్నముతో నవశ్యము లేదు. ఈ ౭ తత్వములును

వేదము మూడువిధములు వానిలో విధులు అకరణే ప్ర
త్యవాయజనకములు గనుక ప్రమాణములు మంత్రము
లనుష్ఠేయార్థ ప్రకాశకములు అనగాచేయదగిన కర్మ
ముల సంగతినిదెలుపునవి అర్థవాదములు విధినిషేధమ
లనుస్తుతించుటకు నిందించుటకుగా గల్పిత కథలను జెప్పు
నవి. జీవుడైన యాత్మనుపాసింప వలయునని విధి వాక్య
ముచే విధింపబడిన దానిం బ్రశంసించుటకుగా అర్థవా
దములుగా నుపనిషత్తులన్నియు నూరకే కల్పితములైనవి
గాబట్టి యుపనిషత్తులు ప్రమాణములుగావు ఇందువలన
ఉపనిషత్ప్రతిపాద్యమగు బ్రహ్మంబు నొప్పుకొనం బని లే
దు విధివాక్యములచేత నుద్దేశింప బడిన ఫలముల ననుభ
వించుటకుగా దేహ విలక్షణులైన నిత్యులగు జీవులను
మాత్ర మంగీకరింప వలయును విధి వాక్య విహితముల
గు జ్యోతిష్టోమాది యాగములు పుణ్యమను పదార్థము
ను గలుగ జేయుచున్న వనియు అపుణ్యమే స్వర్గాది
ఫలముల నిచ్చుచున్నదనియు యీశ్వరుని ఒప్పువా రంద
రును, అదృష్టానుసారము గానే యీశ్వరుడు ఫలప్ర
దాత యగుచున్నాడని, యీ యపూర్వమును ఒప్పుచు
న్నారు గనుక, అపూర్వమే ఫలప్రదమగుచున్నదని, యొ
ప్పుటవలననే యిష్టసిద్ధి గలుగు చుండగా, ననుమానప్ర

మాణముచేత నైనను ఫలప్రదాతకావలెనని ఈశ్వరు నొ
ప్పుకొనుట సరిగాదు. జీవు లనాదిగా నుండి వారు చే
యుకర్మముల తారతమ్యముల వలన క్రిమికీటాది జన్మ
ముల నెత్తుటయు నరకానుభవమును గలుగును. కామ్య
కర్మములు చేయువారు తిరుగా పుట్టుదురు. వేదవి
హితంబు లగు యజ్ఞాదికర్మంబులు ఫలాభిసంధితో జే
యువారు, ఆయాస్వర్గాది ఫలంబులం జెందుదురు. ఫ
లాభిసంధిని విడచి చేయుచో దానివలన బుట్టిన యపూ
ర్వంబె కర్మసంబంధ నివృత్తి పూర్వకంబగు కేవలా
త్మప్రాప్తి యనెడు మోక్షమును గలిగించును. అప్పుడు
నిత్యసుఖాభివ్యక్తి యగును.

ఇంతియేగాక చతుర్థ్యంత వినియోగంబె దేవత యు
వ్యవహరింప బడునుగాని ఫలము నిచ్చు దేవతయే లే
దు, అనియు నిట్లు కర్మబ్రహ్మసూత్ర వ్యాఖ్యాతలును,
మీమాంసక మతస్థులు, నగుభాట్టులు, ప్రాభాకరులు,
చెప్పుచున్నారు.

ఏది యెట్లుండినను, కర్మంబుల వైశద్యముల నెవ్వ
రేర్పఱచిరి, అట్లు చేసిన జీవులకు, కాలాంతర మందు
తత్కర్మ ఫలరూపకమయిన సుఖదుఃఖములను, స్వర్గ

నరకములను, నీచోచ్చ జన్మంబులను, ఎవ్వరిత్తురు.

కర్మమే యిచ్చు ననుటకు, కర్మము జడము ఆ ప్పుడు చేసిన క్రియ అప్పుడే నశించెను. వాటి పుణ్యాపా పాను గుణముగా కాలాంతరమందు ఫలము నిచ్చుటకు దేవుడు లేక యెట్లగును. మంచిది, యొకడు కూనీ చేసి తే విచారించి తూకువేయించుటకు అధికారి లేక వాని దుష్కర్మమే యెట్లు చేయించును.

ఇట్లు అనేకములు పిచ్చి సంగతులుండినను, ఇందలి సారాంశ మేమనగా.

## —❀ పూర్వమీమాంసక మతసారము. ❀—

కర్మానుసారముగా దేవుడైనను, ఫలముల నీవలసి నది. గాబట్టి యజ్ఞవిషయమయిన హింసాకర్మము స రియైనది గాదుగాని, ఒరులకు దుఃఖకరమయిన దుష్క ర్మములు చేయ గూడదనియు, సుఖకరములయిన సు కర్మములు చేయవలయు ననియు, నేపడు చున్నది. గాన, నిది యిందలి సారాంశము.

## ❀బ్రాహ్మ్యామతము, అనగా బ్రహ్మసమాజమువారిమతము.❀

ఈమతకర్త, ప్రథమమందు కలకత్తాలో నుండిన

రాజా రాం మోహన రావుగారు. వీరు వేదములలోగొ న్ని భాగములు అనగా దశోపనిషత్తులు మొదలగు నవి ప్రమాణములని యొప్పుకొనిరి. దీని ననుసరించియే మ దరాసులో వేదసమాజ మతసభ యేర్పడినది.

ఈబ్రహ్మసమాజ మతస్థుడగు కేశవచంద్రసేను అను బంగాలీపండితుడు ఆయుపనిషత్తులు కూడ ప్రమాణము లు కావని యేర్పఱచెను.

ఇప్పుడు కడన నిల్చియున్న బ్రహ్మసమాజమతము. ఈ యభిప్రాయము గలది. ఎట్లనగా, బ్రహ్మమును జీవుడు ను కలరు. బ్రహ్మంబు నామ రూపరహితంబు హేయగు ణ రహితంబు నగుటవలన నిగుణం బనబడును. చిత్తు, అచిత్తు, బ్రహ్మంబు, నీమూడు నిత్యములు భిన్నములు. ప్ర పంచము బ్రహ్మ సంకల్ప జనితము, చిదచిత్తులకు సంబం ధము, బ్రహ్మంబేచేసెను. అది యెట్లో మనకు దెలియదు. చచ్చిన పిదప నిచ్చట జన్మములేదు. పుణ్యానుభవా నం తరము ముక్తి మార్గమునకు బోవుచున్నాడు; పాప మనుభవించిన పిమ్మట జ్ఞానము గలిగి పైమార్గమునకు బోవుచున్నాడు. ముక్తి యనగా అనంతోన్నతగతి ఎప్పు డును జీవుడు పైకిబోవుచు నుండుట జైన మత ముక్తి

వంటిది :- ఇదే మోక్షము - పూజా నామస్మరణాదు లు పనిలేదు. మోక్షోపాయం బెట్లనగా సర్వశక్తితో సంతత పూర్ణజ్ఞానముగా దేవుడున్నాడని బ్రహ్మాంబునందు దానును దనయందు బ్రహ్మాంబును, నున్నట్లు ఏకాంతమునందు సమాధి చేసితె బ్రహ్మానందము గలుగును ఈసమాధి శాంకరాద్వైత సమాధిం బోలియున్నది. జ్ఞానము, యుక్తియు, తదనుగుణశాస్త్రమును, ఈ మూడును కలిసి వచ్చు సత్యాది కార్యములే పుణ్యకార్యములు, అవి కానివి పాపకార్యములు, స్వాతంత్ర్యమును, జీవునికి దేవుడిచ్చియున్నాడు. కాబట్టిపుణ్యాపాపములు మనబుద్ధి పూర్వకంబుగా జేసికొన్నవే, రోగ రాజ్యములును, ఐహిక కారణ సామగ్రిమీద వచ్చుచున్నవే గాని, అదృష్ట మనునది లేదు - వేదములు మనుష్య కల్పితములు గాని, దైవ కల్పితములు గావు. తిథ్యాది పైతృక కార్యములు చేయంబనిలేదు. విగ్రహారాధన గూడదు. విధవా వివాహము కూడును. మరణానంతరము పుణ్యపాపములను ప్రాణి యెట్లనుభవించునోతెలియదు గాని దేవుడే యనుభవింప జేయుచున్నాడు. మోక్ష మనగా సముద్రములో రాయి వేసితే మునిగినట్లు బ్రహ్మామునందు జీవుడు మునుగుట మనుష్యులకు

జాతిభేదములేదు ఇష్టపడితేయెక్కడనేని భుజింపవచ్చును పశు పక్షి వృక్షాదులకు ఆత్మలేదు అని ఇట్లు బ్రహ్మ స మాజ మతస్థులు చెప్పుచున్నారు ఇందులోను బ్రహ్మమును చిదచిత్తులును పృథక్కుగా నిత్యములుగా నుండుట వలన ద్వైతమతము మీద గలుగు కారణానవస్థా ప్రసంగము వచ్చుటయే గాక చిదచిత్సంబంధమును దేవు డె ట్లు చేసెనో తెలియ దనియు మరణానంతర మిక్కడ జన్మము లేదనియు పుణ్య పాపానుభోగానంతరముజ్ఞా నము గలిగి ముక్తులగుదు రనియు వ్రాసిరే వేదములు ప్ర మాణములు కాకపోతె యిది యెట్లు వీరికి దెలిసె. ఉ న్నతగతియే ముక్తి యనుటకు ముక్తు లెవరేని వచ్చి చె ప్పిరా భగవత్ప్రీతిచే మోక్ష ప్రాప్తి లేదు దేవునిలో దాను, దనలో దేవుడు నున్నట్లు తలచుచు మౌనముగా గూచుండుంటే బ్రహ్మానందము గలుగు ననుచున్నారు. మ నస్సుయొక్క యేకాగ్రత, వలన గలుగు నానందము, అ ద్వైతులుచెప్పెడు బ్రహ్మానందముగానున్నది అదిచిత్తైకా గ్రత వలన గలుగు ఆనందము, ఇదిబ్రహ్మానంద మయ్యె డు పక్షమందు నిద్రాప్రారంభా నందాదులును బ్రహ్మా నందము కావలసి వచ్చును, రోగరాజ్యాదు లైహిక

కారణముల వలన వచ్చుచున్నవే గాని యదృష్ట మను నది లేదని వ్రాయుచున్నాడు. లౌకిక కారణముల వలన గలిగిన వేయను నెడల తగినట్లు ప్రయత్నించు వారం దఱును, కార్యసిద్ధిబొందు చున్నారా? మన యత్న మే లేక కొన్ని సిద్ధించుట ప్రతిమనుజునికి ననుభవ మం దున్నది గదా! కొన్నిటికి లౌకిక కారణములు కనుపిం చు చున్నవిగాని, యనిచ్ఛా ప్రారబ్ధ విషయములలో కా రణములు లేకయే కార్యము పుట్టలేదా. మఱియు మ రణానంతరము పుణ్య పాపానుభవము మనుజునికి దేవు డెట్లు చేయించునో తెలియ దనుచు పుణ్య పాపానుభ వానంతరము పునర్జన్మము లేదు. అక్కడ నుండియే జ్ఞానము గలిగి ముక్తు డగు నని వ్రాయు చున్నాడే ఇది మాత్ర మెట్లు తెలిసె అట్లగు పక్షమున బ్రహ్మామునం వొ కతూరిగానే మునిగి ముక్తుడాయెనే అనంతోన్నత గతి గా పైకిపైకి పోవుటే ముక్తియని వ్రాయుటపరస్పర వి రుద్ధము గాదా! మఱియు పశుపక్షి వృక్షాదులకుఆత్మ లేదనుచున్నాడే! ఆపక్షమందు బాలోన్మత్తాదులు అ తివృద్ధులు ఇంద్రియ పాటవములేక పశుతుల్యులుగా ను న్నవారు ఇట్టివారికిని ఆత్మ లేదని చెప్పవచ్చుగదా! కా బట్టి ఇట్టి యనేక ప్రత్యక్షానుమాన ప్రమాణ యుక్తి

విరుద్ధములుండినను, ఇందలి సారాంశము లేవనగా.

## —* బ్రాహ్మ్యమతసారము. *—

సర్వశక్తి గల దేవుడు జగత్తును చేయుచు పూర్ణుడు, సర్వవ్యాపియు, నైయున్నాడు. యుక్తియు, జ్ఞానమును, వీట్లకు అనుకూలముగా నుండు శాస్త్రమును ఈమూడును, గలిసీ వచ్చు సత్యాదులు పుణ్యకార్యము లనియు, అట్లు కానివి పాపకార్యము లనియు, దేవుడిచ్చిన స్వాతంత్ర్యము వలన జీవుడు చేసికొను కార్యములే పుణ్యపాపహేతువు లనుటయు, నివి యిందలి సారాంశములు.

## —* ఆతష్ పరస్తుమతము. *—

ఆతష్ పరస్తులు అనగా అగ్న్యుపాసకులు. వీరు ఈ రాజ్ దేశమందు ఫార్సీలు. వీరివేదము దూసాత్ ఈ మతకర్త మాహాఆబాద్ అనువాడు. ఇందులోం౧౪ భేదములు ఈవలి వార లేర్పరచి కొనిరి. మొదల నీమతము నేర్పరచికొన్న యీరాజ్ దేశస్థులు పశువులవలె కాయ గడ్డలు ధాన్యములు తినుచు కొన్ని తడిపి నానబెట్టుకొని తినుచు నుండిరి. ఆవల యేలాగో రాయి రాయి గొట్టి, కఱ్ఱను కఱ్ఱను మధించి, నిప్పును గనుం

గొని, ఆపైని భక్ష్యపదార్థములు కాల్చుకొని యుడ
క బెట్టుకొని భుజింప నారంభించిరి. ఈయగ్ని యను
నది సర్వవస్తు వ్యాపకముగను, పాకాది కార్యోపయో
గముగను, రాత్రియందు ప్రకాశ కరముగను, ప్రాణా
ధార మయిన యుష్ణమును శరీరమందు గలిగించు నది
యుగాను, నుండుటం బట్టి యిదే దేవుడని యేర్పఱ
చికొని అగ్ని ఆరకుండ అగ్గేరీలు అను దేవాలయము
లు గట్టించి యింకా యగ్ని నుంచి ఆతష్పరస్తులు ఆ
రాధించుచున్నారు.

మఱియు నిట్టి హేతువులం బట్టియే యిండియాలో
బ్రాహ్మణులు నిత్యము అగ్నిహోత్రములు చేయుటయు
యజ్ఞాదులు చేయుటయు నేర్పడ్డది. ఇవి యేర్పడునప్పు
డు కాల్చి యుడకబెట్టి తినుటే యెరుగుదురు గాని, మ
సాలా పెట్టి వండుట యెఱుగరు. ఎఱిగి రేని, అట్లు వం
టలు చేసియే, హోమములు చేయుండని వ్రాయుదు
రు. ఇందుకు తమకు దెలిసియుండు స్త్రీసుఖము అన్ని
టికి హెచ్చని స్వర్గమందు రంభాసంభోగాదులు ఫల
ములని వ్రాసిరి. మఱియు వేదములు పూర్వముపశు భా
ష వంటి భాషగల మనుజులు అందఱు చేరి సంస్కృత
భాష నేర్పఱచు కొనిరి. అప్పుడు ఛందోబద్ధము లేక

మాటలుగా వేదము లేర్పడెనవి. అనేకాపశబ్దములును అందున్నందున వానిని ఛాందసములని యాక్షేపింపరు. ఈవల ఛందస్సులు కొంతమట్టుకు వ్యాకరణ నిబంధనలు ఏర్పఱచుకొని స్మృతి పురాణాదులు చేసిరి. అందుండు శబ్దదోషములు ఆర్షములని మన్నించెదరు. అందుకువాల్మీకిమొదటివాడు, కాబట్టి రామాయణము ఆదికావ్యంబనంబడును. ఉపనిషత్తులలో స్మృతులలో శ్లోకములుండలేదా యంటే, అవి యీవలివారి కల్పితములు. ఇందుకు చాలా నిదర్శనము లున్నవి. ఈవలివారు నానార్థబోధకపదములు నానాదేశములందు వాడుకగా నుండు వానిని జేర్చి నిఘంటువు లేర్పఱచిరి. ఇవన్ని చేర్చ బడిన కాళిదాసాది కవిత్వములు శ్లాఘ్యము లయ్యె.

సమష్టికి ఈసంస్కృతము అనేక దేశీయ జనులచే నేర్పఱచు కొన్న భాషగాన దీనికి దేశములేదు. యిందులో నున్న పదములను తద్భవ తత్సమములుగా నితరభాషలలోకి దెచ్చు కొన్నందున వాటికి సౌష్టవ మేర్పడినది. తక్కిన నామములు దేశ్యములుగా నానాభాషలలో నేర్పడ్డవి.

## —* సూర్యోపాసన. *—

ఈవలివారు, నీటివలన నిప్పుఆఱుట ఎంతేయుపా

సించినను అంటిలేకాలుట మొదలగు తక్కువ గుణము లుచూచియు, సర్వ పదార్థములలో, సూర్యుడు ముఖ్యోపయోగిగా నుండుటను బట్టియు, భూమియొక్క ఆవిరిని కిరణములచే నాకర్షించి వర్షించుటను బట్టియు, ఋతు ధర్మములు జరుగుటయు పుష్ప ఫలాదులు గలుగుటయు, గాలి వీచుటయు, కాల ప్రమాణము, ఆయుఃపరిమితియు, దివా రాత్రములు, వ్యవసాయనిద్రా కాలములును, ఏర్పడుటయు, చాతుర్థిక జ్వరాది రోగములు, ఆయా కాలములను బట్టి కలుగుటయు, నిట్టి హేతువులను బట్టి మఱికొందరు. యీరానులో సూర్యుడే కారణమని అప్తాబ్ పరస్తు మతము నేర్పఱచిరి.

అట్టి కాలమునందే యిట్టి హేతువులను బట్టి యిండియాలో ప్రాతర్మధ్యాహ్న సాయాహ్నముల యందు త్రివర్ణములవారు సంధ్యా వందనము చేయుటయు, అర్ఘ్యప్రదానాదు లిచ్చుటయు, నేర్పడినది.

ఈసూర్యుడు నియతముగా దృగ్గణిత ప్రకారముగ నియామన మును దప్పకుండుట చూచి ఇతడు దేవుడు గాడు దేవుడైతే యింత నిర్బంధములో నుండునా

కాబట్టి సూర్యాంతర్వర్తి పరమాత్మయని చెప్పసాగిరి అదే అంతరాదిత్య విద్య యనంబడును.

మఱికొందరు మహా రాజ దృష్టాంతముగా వైకుంఠమునందు నారాయణు డున్నాడని కల్పించిరి అట్లుంటే పరిఛిన్ను డగును తచ్ఛక్తులును పరిచ్ఛిన్నములుగా నుండవలె నని యెంచి దేవునికి రూపము లేదనియు సర్వత్ర పరిపూర్ణు డనియు సర్వశక్తులు గల వాడనియు నిశ్చయించికొనిరి యిందలి సారాంశము లెవ్వి యనగా.

—* ఆతష్ఫరస్తుమత సారము. *—

సమష్టికి నెవ్వరేసియు, అగ్నిని దేవునిగా నుపాసించుట సరిగాదు గాని నిత్యంబును అగ్ని చల్లార కుండ నింటిలో నుంచుట వలనను మంచి వస్తువులు వ్రేల్చుట వలనను, హోమ జనిత ధూమాదుల వలనను, ఆరోగ్యము గలిగి సాంక్రామిక వ్యాధికి నవకాశంబు లేకుండును ఇందుకు దృష్టాంతముగ నోకుడు వ్యాధులు వచ్చినప్పుడు సర్కారువారు గంధకము కోల్‌తారు మొదలైన వాని పొగ వేయించుటయు, ఆయుర్వృద్ధి కరధూపము లైన లాజలు తండులములు ఘృతము అన్నమువీనిపొగలు ఆయుర్వృద్ధి కరములని వైద్య శాస్త్రమందుండుటయు,

మాంస చర్మ కేశధూపాదులు వృక్షములకు వెయవలసి నదని వృక్షాయుర్వేదమందుండుటయు, నెరింగి యున్నాము గదా కాబట్టి ఇవియే ఇందలి సారాంశములు.

—※ ఆస్త్రాబుఘరస్తుమతసారము. ※—

ఈమత మందలి సారాంశ మేమనగా సూర్యకిరణ ప్రసారము ఆరోగ్యము గలిగించు చున్నది ఇందుకు నిదర్శనముగా, రోగనివృత్తికి సూర్యోపాస్తి శాస్త్రము నందు జెప్పబడి యుండుటయు ఎండ దగులునట్లు తిరుగువారు దృఢ గాత్రులుగా నుండుటయు, ఆంగ్లేయులు ఉదయపుటెండ తగులునట్లు గుఱ్ఱపు సవారీ చేయుటయు, హిందువులు మహమ్మదీయులు సాయంకాలపుటెండ తగులుట యారోగ్యకర మనుటయు, మేఘచ్ఛన్నుడై సూర్యుడు ప్రకాశింపమిం జేసి శరీరములు జబ్బుగా నుండుటయు, సూర్య ప్రకాశము వలన ఆకులు పుష్పములు, విలసిల్లుటయు, సూర్య రశ్మి దగులని వృక్షలతా సస్యాదులు వర్ధిల్ల కుండుటయు, నిందువలన॥ శ్లో॥ మేఘచ్ఛన్నేహ్నిదుర్దినం” అని మేఘచ్ఛన్న దినము దుర్దినమని నిఘంటువుల యందు వ్రాయబడి యుండుటయు, జూచుచున్నాము గదా? ఇందువలనసూర్యా

తపప్రసారము శరీరమునకు దగులుట మంచిది. యి దియే యిందలి సారాంశము.

## —* శాక్తేయమతము. *—

జగత్తుకు శక్తి కారణము. శక్తి యనగా సర్వశక్తుల సమష్టి. ఈమె, స్త్రీరూపదేవత. ఈమె, రజస్సత్త్వత మస్సులనుమూడు గ్రుడ్లుగా పెట్టగా నందుండి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పుట్టి సృష్టి స్థితి సంహార కార్య ములకు అధికారులైరి. ప్రపంచమంతయు తత్తద్వస్తు స్వభావముల వలన గలుగుట ప్రత్యక్షము. అనగా వా ట్లవాట్ల యందుండు శక్తులు. ఇందుకు నిదర్శనము, ప్ర తి మనుష్యుడును, తన వార్ధక్య దశయందు తనకు శక్తి లేదని చెప్పుచున్నాడు. అందువలన శక్తి ముఖ్యము- ఈ ప్రపంచమంతయు, వాట్ల వాట్ల శక్తులతో నుండుటను బట్టియు, ఆయా వస్తువులు మేళన మగుట వలన విజా తీయ భేదములు గలుగుటను బట్టియు, ప్రపంచము స్వ భావ సిద్ధమని నేచర్ మతము వారగు స్వభావ వాదు లును, బ్రహ్మంబు నిర్గుణంబు మాయాశక్తి వలన ప్ర పంచంబు గలుగు చున్నదని వేదాంతులును, చెప్పటం బట్టి ప్రపంచమునకు ప్రధానమగు శక్తి ముఖ్యము, ఈ

స్థూల సమష్టియే, మాయా శక్తియను దేవత కాబట్టి జగదంబ యని యామెకు పేరుగల్గె. యీమె నుపాసించితే నరకంబునుండి మోక్షము గలుగుచున్నది. యీమె దయ గలిగితే మాయనివర్తించి జ్ఞానంబున మోక్షంబు గలుగు ననియు, శాక్తేయ మతస్థులు చెప్పుచున్నారు.

## —* ఉపాసనాక్రమము. *—

మూలాధారము మొదలు షట్చక్రములగుండను ఆమెయుండును. శిరస్సునందుండు సహస్రారచక్రము ముఖ్యస్థానముగ ఆమె యుండును, గావున యోగ ముద్రాది సాధనములచేత ధ్యేయురాలు. యీమెయే ముక్తి కాంత యనియు, బాహ్య పూజ యందు చతుర్భుజంబు మద్య పాత్ర శూలాద్యాయుధ ధారియు, పంచ ప్రేతాసనా రూఢంబు నగు విగ్రహంబును జేసి పూజింప వలయును. మద్య మాంసములు బలమును, శక్తియు, గలిగించునవి గాన నవి పూజా ద్రవ్యములందు జేర్చుట దేవికి ప్రీతి కరము. నర మాంసాదిగా సమస్త జంతుమాంసములు, నివేదించి భుజింపవచ్చును. అందును మనుష్యుని తలపుర్రె యందు మద్యము నుంచి నిండించి త్రాగుట అత్యంత శ్రేష్ఠము. మతంగస్త్రీయందు

యీశక్తిని ఆవహింపజేసి బిత్తలి జేసి దాని త్రికోణ స్థళముం బూజింప వలెను.

దానికే శ్రీచక్రము అనిపేరు. ఇది బంగారముతో చేసి పూజింపవలయును. మఱియును, శ్మశానమందు స్త్రీశవము యొక్క ప్రధాన స్థానమందు తన లింగము ప్రవేశపెట్టి అప్పుడు ఆశక్తి మంత్రముజపించ వలయును. జంగమ ప్రాణుల పుట్టుకకు స్థాన మైనందున యోనియే శక్తికి ముఖ్యస్థానము కాబట్టి యోనినే పూజించ వలయును. దీనివలన సంపద గలుగు చున్నది. అనియు, ట్లు శాక్తేయులు చెప్పుచున్నారు.

మఱియు రామానుజ కూటపువారును, భైరవమతస్థులును, కాపాలికులును, అఘోరీలును, కాలాముఖులును, క్షపణకులును, యీమొదలగు వారు మద్యమాంసాదులు ఆయాదేవతా పూజలయందు నివేదించి భక్షించుటయు, వరుస వావి లేకుండ సంబంధములు చేయుటయు భార్యలను గురువు నొద్దకు బంపించుటయు నిట్టి యనేక కార్యములు చేయుచున్నారు, శాక్తేయులును, ఇంతకంటె నెక్కువగా జేయువలయు నని చెప్పెదరు. యీసంగతులు విస్తారముగా దబిస్తానే మజా

హెూబు అనుపార్సీ గ్రంథమందున్నవి చూడుడు.

ఇట్టి యనర్థపు సంగతులు పెక్కులుండినను యీ శాక్తేయ మతమందలి సారాంశము లెవ్వియనగా.

—* శాక్తేయమతసారము. *—

సర్వశక్తి సమష్టియే, దేవి యనిచెప్పుటవలన ఆస్తికమతస్థులు చెప్పెడు ప్రకారము బ్రహ్మము సర్వశక్త్యుపబృంహిత మని చెప్పుమాటకు దగ్గరగా నున్నది. అయితే స్త్రీయని చెప్పెదరు, బ్రహ్మమునకు స్త్రీత్వపుంస్త్వములులేవు. యీశక్తులను బట్టియే నేచర్ మతమువారగు బ్రాడ్లామొదలగు నాస్తికులు వస్తువుల స్వభావశక్తులను బట్టి స్వభావమే కారణ మని చెప్పెదరు. అయితే అది జడమందురు జడమైతే వివిధ విచిత్రసృష్టియెట్లు గల్గును ఉపయోగములను యోచింపక సిల్పి పోగ బండి మొదలైనవి యేలచేయును గాబట్టి యనేకోపయోగములు యోచించి ప్రపంచ సృష్టి చేయుటకు జ్ఞానముగల సర్వ శక్తి గల బ్రహ్మంబుండక విధి లేదని ఆస్తికులు చెప్పుచున్నారు, ఎట్లైనను సర్వశక్తితో జేరిన సమష్టి శక్తి జగదంబ యనుట యిందలి సారాంశము.

## —❋ శైవమతము. ❋—

వీరికి శైవాగమము ప్రమాణము. శివుడు జగత్కారణముశక్తి ఆయన భార్య. శివశక్తి సమాయోగమువలన సర్వప్రపంచంబు పుట్టినదనియు మనుష్యాది జంతు సృష్టికి లింగయోనులు ముఖ్యములు అందువలననే శివునిని లింగమునుగా పార్వతిని యోనిగా అనగా పానవట్టముగా నేర్పఱచి పూజించ వలయుననియు లింగము మహాదేవుడు,విష్ణువుయోని, ఇదే పానవట్టము, ఈరెంటిని మోయుటకు బ్రహ్మదేవుడు పీఠంబు ఈ మూడింటి కూడికయే త్రిమూర్త్యాత్మకము. శివునికి విష్ణువుభార్యఇతదేపరమశివుడు. పరమ తత్వము శివనివాసంబయిన కైలాసముయొక్క ప్రాప్తియె మోక్షము భస్మ లేపన లింగరుద్రాక్ష ధారణాదులు చేయవలయును దీని వలన నెంత దోషము చేసినను అంటదు తోడభిక్ష మొదలగునవి జంగమాతిథికి శైవుడు చేయవలయును తోడభిక్ష యనగా అతిథి కోరినపుడు తనభార్యనుబంపుట.

దీనికి బల్లాళరాజు చరిత్రము నిదర్శనము అని యిట్లు శైవ మతస్థులు చెప్పుచున్నారు.

శివుడు కైలాస వాసి యని పరిచ్ఛిన్నుని గాను జెప్పె

దరు పురాణాదులలో ఆయుఃప్రమాణము శివునికి జెప్ప బడియున్నది గావున నితడు పరమ కారణ మెట్లగును శివుడు భార్య అయిన దాక్షాయణి చనిపోతే రెండవభార్యగా పార్వతిని పెండ్లియాడె నని యున్నది. విష్ణువు మోహినీవేషము వేసుకుంటే స్త్రీయనుభ్రాంతితో తరిమి పట్టుకొని రమించె ననియు ఋషులశాపము వలన లింగము ఊడిపడె ననియు నున్నది.

ఇట్టి లనేకములు రసాభాసపు సంగతు లుండినను ఇందలిసారాంశమేమనగా.

## —※ శైవమతసారము. ※—

శివశక్తి సమాయోగము వలన ప్రపంచముగలుగుచున్నది. అనుటసారాంశము. ఏలనంటే, సర్వశక్తిగలబ్రహ్మమునకుసంకల్పము గలిగితేనే గాని అతడు జగత్సృష్టి జేయడు, ఆబ్రహ్మమే శివుడు, సంకల్పాది జగత్కార్యమే ఆయనశక్తి కాబట్టి యిదియే యిందలిసారాంశము.

## —※ వైష్ణవమతము. ※—

పాంచరాత్ర వైఖానసములు ప్రమాణములు విష్ణువే కారణము, ఆయన నారాయణ రూపముతో వైకుంఠము నందు ఆయుధాదులు ధరించుకొని యున్న

వాడు. ఆయా యుధములవలెలోహముతో జేసి కాల్చిమ
నము చక్రాంకనముజేసికొనవలయును ద్వాదశోర్ధ్వ పుం
డ్రములును తులసిపూసలు తామర పూసలు ధరింప వ
లయును. తులసి కణ్ఠామాలమందుంచి కొనవలయును॥

శ్లో ॥ ఖాదన్మాంసం పిబన్మద్యం సంగచ్ఛ న్నంత్యా జాన
పి। సద్యోభవతి పూతాత్మా కణ్ఠే తులసి ధారణాత్॥

అనియు, వీటివల్ల సర్వపాపములు నశించు ననియు, వి
ష్ణువును నవవిధభక్తులతో నారాధించితే, మోక్షము గ
లుగును మోక్షమనగా వైకుంఠ ప్రాప్తి అందులో సా
లోక్య సామీప్య సారూప్య సాయుజ్యము అని 4 భేదము
లు అనియు నిట్లు వైష్ణవులు చెప్పుచున్నారు. తులసీ ధా
రణము వలన పాపమెట్లు నశించును, పరిచ్ఛిన్నతయు,
వర్షాతపాదులు సహింపక వైకుంఠ మందిల్లుకట్టుకొ
నియుండుటయు, శత్రుభయము వలన సర్వదా యా
యుధములు ధరించు కొని, పార్షదులను గావలియుం
చుకొనుటయు భక్తజన దత్త నైవేద్యాదుల వలన నా
కలి దీర్చికొనుటయు, ముక్త జనుల వలన బాదములు
పిసికించి కొని నొప్పులు పోగొట్టు కొనుటయు, విసరుట
వలన చెమటపోగొట్టు కొనుటయు, నిట్టి మనకున్న కష్ట
ముల వంటి కష్టములు అన్ని ఆయన కున్నట్టు లేర్పడెను

మరియు పురాణములలో ఆయుః ప్రమాణము చెప్పబ డియున్నది గావున ఆయన దేవుడెట్లగును మరియును నిచ్చటి మన సంగతులు చారుల వలన దెలిసికొనవల యునేగాని పరిచ్ఛిన్నుడగుట వలన సర్వసాక్షియైయె ఱుంగజాలడు గదా.

ఇంతే గాక భయముతో నెల్లప్పుడు దేవుని సన్నిధి లో సేవచేయు ముక్తునికి సుఖమెక్కడిది. "సేవాశ్వవృ త్తిః" అని నిఘంటువులనున్నది. ఇక్కడ రాజసేవాదిక ష్టములు తెలియదా, ఇట్టి యసంభావితము లయిన సం గతులుండినను ఇందలి సారాంశమేమనగా.

## —* వైష్ణవమతసారము. *—

మందబుద్ధులకు చిత్రకారుడు వ్రాసినపటములు మొ దలయినవి దేవుడని భావించి భక్తిచేయుటకును, ఆరూ పములను మనస్సులో ధ్యానించుటకును, యీ నెపము చేత "యతస్తద్విషయామతిః" అను వచనప్రకారముగ దేవుని విషయమయిన మతియుంచుటకును హేతువగుచు న్నది, కాబట్టి యిదియిందలి సారాంశము.

## —* హిరణ్యగర్భమతము. *—

హిరణ్యగర్భుడు అనగా చతుర్ముఖుడు ఇతడు

ప్రపంచ సృష్టికర్త గావున నితడే ముఖ్యదేవత యని హిరణ్యగర్భమతస్థులు చెప్పుచున్నారు.

హిరణ్యగర్భుడు ఒక అండములో నుండి పుట్టెను, ఇతనికి హిరణ్యగర్భమానముతో ౧౦౦ సంవత్సరముల ఆయుస్సు, ఇతని యుత్పత్తి లయములకు కర్తయగు దేవుడు మఱియొక డున్నాడు అని యిట్లు శాస్త్రములలోనే యున్నది కూతురిని రమించె నని యున్నది. గనుక, ఇతడు కారణమయిన దేవుడు గాడు. ఇట్లుండినను: ఇందలి సారాంశ మేమనగా.

## హిరణ్యగర్భమత సారము.

ఇతడే జగత్స్రష్ట యని చెప్పుట వలన నిట్టి గొప్ప కార్యములు చేయుటకు ఇతనియందు భగవద్విభూతియుండ వలసినదియావశ్యకము గాబట్టి దానినిబట్టి యుపాసించు టయిందలి సారాంశము.

## విరాణ్మతము.

ప్రపంచమే బ్రహ్మరూపము యీప్రపంచోర్ధ్వాధోభాగములు శిరఃపాదాదులుగా భావించి పురుషరూపముగా ధ్యానించుటే, విరాట్పురుషోపాసన, యనంబడును, అనివిరాణ్మతస్థులు చెప్పెదరు.

ఇందులో నశ్వరములుగానుండు ప్రపంచపదార్థము లేమి, నామరూపములేమి, నశింపని బ్రహ్మమునకు అవయవము లెట్లగును.

ఇట్టిదోషము లుండినను, ఇందలిసారాంశ మేమనగా:

—✻ విశిష్టాద్వైతసారము. ✻—

జీవునికి తనస్వరూపము కాకపోయినను దేహము గురుతగునట్లు చేతనా చేతనమిశ్రితమై యుండు నీప్రపంచము పరమాత్మయగు దేవునికి గురుతగుటవలన ఈ ప్రపంచము ఆపరమాత్మకు దేహము కావచ్చును మరియు భాగవతము నందున్న యన్వయ వ్యతిరేక దృష్టాంతములచేత బ్రహ్మము ప్రపంచము కావచ్చును వ్యతిరేక దృష్టాంతముచేత నామరూపాత్మక ప్రపంచము బ్రహ్మము కాకపోయినను బ్రహ్మమే ప్రపంచ మునకు నుపాదానకారణ మగుటవలన నిదియిందలి సారాంశము.

యీయన్వయ వ్యతిరేక విషయము మనస్సాత్ప్వ కూటపు మొదటి మెంబరగు తిరుమలసెట్టి జగన్నాధము వ్రాసిన మహాద్వైతము నందున్నది చూడుము.

—✻ సౌగతమతము. ✻—

యీమతకర్త సుగతాచార్యుడు, ఇతనికి నల్వురు

శిష్యులు, ౧ సౌత్రాంతికుడు, ౨ వైభాషికుడు, ౩ యోగాచారుడు, ౪ మాధ్యమికుడు యీమతమువారు నాస్తికమతస్థులు, మొదటిముగ్గురు క్షణిక వాదులు అనగా, సమస్త పదార్థములును ప్రతిక్షణమందు బుట్టుచు నుత్తరక్షణమందు నశించుచున్నవి యిదేప్రకారముగతిరుగాబుట్టుచు నశించుచునుండు ప్రవాహము వలన నవిస్థూల దృష్టికి నేకరీతిగ నున్నట్టు గనుపడు చున్నవని చెప్పుచున్నారు నాల్గవవాడు ఏదియు లేదు ఉన్నట్టు తోచుటమాత్ర మేగాని తత్వము శూన్యమనుచున్నాడు యీమతమందిట్టియవ్యక్త ప్రలాపము లున్నవి తత్ఖండనము నాస్తికధ్వాంత భాస్కర గ్రంథమునందు బూడుడు.

ఇట్లుండినను ఇందలిసారాంశ మేదనగా.

## —* సౌగతమతసారము. *—

ప్రతిపదార్థములు క్షణికము లనుటవలన లౌకికదుఃఖము గలిగినప్పుడు క్షణికములగు దీనిని గుఱించి దుఃఖింపనేలయని దుఃఖోప శాంతి గలిగించుకొనుట కవకాశంబు గలుగును ఇదియే యిందలి సారాంశము.

## —* యోగమతము. *—

యోగపాతంజలి సూత్రములకు భాష్యకర్తలగు వా

రిమతము, యోగమతం బనంబడును ఇందులో మంత్ర

యోగ,లయయోగ, హఠయోగములని౩ విధములుగమ

త్రయోగము, అనగా అజపా మంత్రోపాసనసేయుట

ఎట్లనగా తనశ్వాసము దినము ౧ కి ౨౧౬౦౦ మాఱు

లు ఆడుచున్నది శ్వాసములోపలికిదీయునప్పుడు అన

గా పూరించునప్పుడు "సో" అనునక్షరము పలుకుచు

న్నది విడుచు నప్పుడు అనగా రేచించునప్పుడు "హం"

అను నక్షరము పలుకుచున్నది ఈ రెండక్షరములే "సో

హం" అను మంత్రము దీనికి అర్థము వాడు,నేను, అన

గా ఆబ్రహ్మము నేను అని భావము.

ఈ ౨౧౬౦౦ శ్వాసములలో.

| | | |
|---|---|---|
| ౧ | మూలాధారచక్రంబునందుండువినాయకునకు | ౬౦౦ |
| ౨ | స్వాధిష్ఠానంబు నందుండు చతుర్ముఖునకు. | ౬౦౦౦ |
| ౩ | మణిపూరక మందుండు శ్రీమహావిష్ణువునకు. | ౬౦౦౦ |
| ౪ | అనాహతంబు నందుండు రుద్రునకు. | ౬౦౦౦ |
| ౫ | విశుద్ధంబు నందుండు జీవాత్మునకు. | ౧౦౦౦ |
| ౬ | ఆజ్ఞాచక్రంబునందుండు పరమాత్మునకు. | ౧౦౦౦ |
| ౭ | సహస్రార చక్రంబునందుండు శ్రీగురుస్వామికి. | ౧౦౦౦ |
| | | ౨౧౬౦౦ |

ఈప్రకారమువప్పించునది.మంత్రయోగంచక్రస్థానములు

శ్లో॥ మూలాధారం గుదస్థానం స్వాధిష్ఠానంతు మేహనమ్ । నాభిస్తు మణిపూరాఖ్యం హృదయాబ్జమనాహతమ్ । తాలుమూలం విశుద్ధాఖ్య మాజ్ఞాఖ్యం నిటలాంబుజమ్ । సహస్రారం బ్రహ్మరంధ్ర మిత్యాగమవిదోవిదుః ॥ అనియున్నది. ౨ లయయోగము. అనగా ప్రతిదివసాభ్యస్త రేచకాది త్రివిధానిల సంయమన పూర్వకంబుగాబ్రాణవృత్తియందుఅపానంబుఅపానవృత్తియందుబ్రాణంబును లయంబు గావించుట లయయోగంబు ॥ శ్లో ॥ మనోగ్రేవసతే బిందుః ప్రాణాగ్రేవసతే కళా । ఉభయోర్లీయతే నాదం లయ ఇత్యుచ్యతే బుధైః ॥ అని యున్నందున తారకనాదాది లక్ష్యములు. ఈయోగమందు చేరినవే యగును. ౩ హఠయోగము. అనగా మూల బంధోడ్యాణ బంధ జాలంధర బంధపూర్వకంబుగా రేచకంబుల నుడిగించి ప్రాణాపానంబుల రెంటిని రేయిం బగలొక్కచందంబున గుంభించుట హఠయోగంబు ఇందుకుశ్వాస నిరోధ మనగా ప్రాణాయామము. రేచక పూరక కుంభకములు చేయుట. ఇంను రేచక కుంభకము, పూరక కుంభకము ఇత్యాది భేదములు గలవు. దీనికి అంగములు ౮౪ ఆసనములు ఇందులో చేరినవే. లంబికాయోగము, అనగా తననా

లుకను అంగిలి రంధ్రములోకి జొనుపుట. ఇదియు హఠయోగము. ఈత్రివిధయోగములకు ఫలము వాయువు కదలకుండ నుండుటచేత చిత్తము అనగా బిందువు చలింప కుండుట, యిందు వలన నొక సుఖావిర్భావము గలుగుచున్నది. ఈయానందము అద్వైతులు చెప్పెడు నమనస్కానందము వంటిది. ఉపాయభేదము లెట్లు చేసినను మనస్సుకు గలుగు ఏకాగ్రత వలన గలుగు ఆనందమే యగును. ఇట్లు యోగము చేసిన యోగులు అంత్యకాలము నందు సుషుమ్నా నాడీమార్గముగా ప్రాణోత్క్రమణముచేసి అర్చిరాది గతిగా నుత్తమ గతిని పొందు చున్నారు. ఇందుకు భాగవతము నందు ద్వితీయస్కంధములో ॥ సీ ॥ అంఘ్రి మూలమున మూలాధార చక్రంబు బీడించి ప్రాణంబు బిగియబట్టి । నాభీతలము జేర్చి నయముతో మెల్లన హృత్సరోజము మీది కెగయ బట్టి । యటమీదనురమందు హత్తించి క్రమ్మఱ దాలు మూల మునకు దఱిమి నిలిపి। మతముతో భ్రూయుగ మధ్యముం జేర్చి దృక్కర్ణ నాసా స్యమార్గములుమూసి । యొంటినున్న యోగి యొక్క ముహూర్తార్థ । మింద్రియానుషంగ మింత లేక। ప్రాణము లదపించి బ్రహ్మ రంధ్రము చించి। బ్రహ్మమందుఁగలయు

ఇట్టి సిద్ధికి ప్రాణాయామాభ్యాసము చేయు వారు నాడీ శోధనయను వస్తి ధౌత క్రియలను చేయవలయు ను. వస్తియనగా అడవి ఆముదపు కాడ ఆసనములో నెక్కించుకొని నీటిలో గూర్చుండి ఆనాళము గుండ ను దకమునుగడుపులోనికి బీల్చుకొని కడుపు నలిపి తిరిగి గు ద ద్వారముగుండనే విడిచితే మలశుద్ధి యగుననుట.

ధౌతి యనగా ముందు కడుపునిండ నీళ్లుత్రాగి నాలు గంగుళములు వెడల్పు కొంతపొడుగు గలగుడ్డ పేలిక మ్రింగి కొన పట్టుకొని తిరిగి బైటికి లాగితే కడుపున నుండు పిత్తము శ్లేష్మము ఊర్ధ్వ ముఖముగా బైటికి వ చ్చుచున్నదనుట.

ఇట్లు పరిశుద్ధము చేయుట వలన రేచక పూరక కుం భకాదులు చేయుట కనుకూలముగా నుండును అని యి ట్లు యోగమతము వారు చెప్పుచున్నారు.

ఇది పెద్ద పొరపాటు - అన్నాదులు భుజించితే కడు పులోకి వెళ్లి జీర్ణించి మల రూపముగా వెళ్లు నాళము వేఱు, శ్వాసము పోయివచ్చు నాళము వేఱు- ఇట్లుండగా అన్నాదులు పోవు నాళపరిశుద్ధి వలన శ్వాసనాళ పరి

శుద్ధి యెట్లగును.

మఱియు యోగులు ప్రాణోత్క్రమణము చేయున పుడు శ్వాసమును పూరించి మూలాధారచక్రము వ ఱకు పోనిచ్చి అచ్చట నుండు ప్రాణవాయువులలో జే రిన యపానము మొదలు కొని పైకి ఆకర్షించుచు పం చ ప్రాణములను జీవుని సుషుమ్న నాడియందు ప్రవేశిం ప జేసి బ్రహ్మరంధ్రమునకు దీసికొని వచ్చి బ్రహ్మరం ధ్రము చించి అచ్చటి నుండి వ్యుత్క్రమణముచేసితే అ ర్చిరాదిగతి ద్వారముగా మోక్షము గలుగుచున్నదని చెప్పు చున్నారు. ఇది మిగుల నసంగతము.

శ్వాసనాళము గుండ శ్వాసనీడ్చుకొని తిరుగ శ్వాస మును విడుచుచునుండు రబ్బర్ సంచివంటి శ్వాససంచి హృదయస్థాన మందున్నది. అదిశ్వాసము నెంతపూరిం చినను అది ఉబ్బుచున్నదే గాని ఆసంచిని వదలి వాయు వు ఎటుపోవుటయు లేదు అట్లుపోయిన యెడల తక్షణ మే ప్రాణము పోను. అయితే ఆసంచి యుబ్బుటవలన ఆతోపుడుకు కుక్షిలోనుండు పేగులు మొదలగు నవి ఉ బ్బుచున్నవే గాని శ్వాసము కుక్షిలో ప్రవేశించి యు బ్బుటగాదు. ఇది మెడికల్ కాలేజిలో చూచియున్నాము.

ఇట్లుండగా మూలాధార చక్రము వఱకు బోయి యొకనాడి నుండి వాయువు నీడ్చుకొని ప్రాణోత్క్రమణా ముచేయుట యెట్లు, ఇట్లు పొరపాటుగా వ్రాసినశా స్త్రకర్తలు శవమును గోసి పరీక్షింపని వారుగా గన్ప డు చున్నారు.

మఱియు, వీరు, సోహం ॥ అనగా తానే బ్రహ్మమని చెప్పుచు నుండు నప్పుడు యింతశ్రమపడి మోక్షము నేల సంపాదింప వలెను. ఇంతకష్టపడితే మోక్షము దొరుకు చున్నదని యెప్పుడు చెప్పుచున్నారో వారిమాటలవలన నే జీవునికి బంధమున్ను మోక్షమున్ను గలుగు నట్లు దే వుడునిఱయించి నట్లు లేపడు చున్నది. అయితే అ ట్టి దేవుని నుపాసింపక ఆయనదయరాక యెంతశ్రమప డినను మోక్షము లభించునా? కాబట్టి యిట్టి యనేకా క్షేపము లుండినను ఇందలిసారాంశ మేదనగా.

## —* యోగమతసారము. *—

శమదమాదిగుణము లుండవలయు ననియును త్రివిధ యోగతారకనాదాది లక్ష్యములు చిత్తస్వాధీన కరము లగుట వలనను విశేషకాలము సమాధిచేయ వలె నని యుండుట వలనను, దుర్విషయముల కవకాశంబు లేక

యుండుటయును యిందలిసారాంశము.

## —॥ బావానానక్ మతము. ॥—

ఈమతము పంజాబుదేశ ప్రసిద్ధము ఈబావా నానక్కు సిక్కులకు గురువు, సిక్ అనగా హిందూస్థాన భాషలో శిష్యుడు వీరిశిష్యులలో చేరిన వాడు సిక్కు, ఏ కులస్థుడు గాని యెవరైన గాని వీరి పంథాలో జేరవచ్చును. యీమతస్థులకు గురుముఖీ అనుగ్రంథము ప్రమాణము, యీమతమందు భగవంతుడు సర్వశక్తి గలవాడు, అతిపరిశుద్ధుడు, సర్వవ్యాపకుడు, గావున, విగ్రహారాధన గాని పరిచ్ఛిన్నరూపధ్యానము గాని చేయుట తగదు పైజెప్పిన భగవంతుని సేవించుట వలన అంబియాలు, అనగా అవతారమూర్తులు. సిద్ధులు మొదలగు వారు మహిమ గలవారైరి.

జీవహింస చేయగూడదు, మాంసము విక్రయించి జీవించెడు వారి యొద్ద కొని మాంసము భుజింపవచ్చును గాని, తురకలు గొంత్తును బండవేసి హలాల్ చేసినట్లు చేసితే ఆమాంసము తినగూడదు. ఇట్లు పోట్లేలిని కోయుటకు అటాక్క అనిపేరు. ఝటాక్కగా, అనగా పోట్లేలిని నిలువ బెట్టి కసాయిలు జటఅని నరికే మాంస

ము విక్రయించితే ఆమాంసము కొని భక్షింపవచ్చును, క్షౌరము నఖ నికృంతనము కూడదు. పూర్వము మిథిలా నగరము నందున్న జనక మహారాజే నానాక్కు గా బుట్టెను, దేవునియందు విశేష భక్తిచేయు వాడు ఇష్టసిద్ధింబొందును జీవహింస చేయనివాడు దేవునిలో ఐక్యంబగును నిరంజనుడు పరబ్రహ్మము పరమేశ్వరుడు అని భగవంతునికి పేరు, భక్తుడు బందా అనంబడును. జగత్తుకు దైవము ఒక్కడే.

ఇట్టిభావన తురకలుగాని హిందువులుగాని చేయుచువారు వారు కారణములని చెప్పెడు దేవుళ్లు కారణములుగాకున్నను దేవుడు మన్నించునేగాని కోపింపడు ఎట్లనగా చిరకాలమునకు తండ్రి దేశాంతరమునుండి స్వగ్రామము చేరునప్పుడు తండ్రి నెదుర్కొనవలెనని వచ్చిన కుమారుడు, తండ్రి ఇతడని గుర్తుతెలియక మఱియొకనికి దండము పెట్టినంత మాత్రముననే తండ్రి మన్నించునుగాని కోపించునా అలాగే దేవుడును కోపింపడు.

హింసా చేయుటగాని యొకరిని దుఃఖింప జేయుటగాని కూడదు సత్యము పలుకవలెను అని బాబానానక్ చెప్పుచున్నాడు.

ఇంతేగాక యీవల బావానానక్ గారి గద్దిశిష్య ప
రంపరలో అర్జునమల్ అనియు గురుగోవింద జీయనియు
పిలువంబడు నాతడు "బావానానకే దేవుడు అట్లు ఎం
చనివారు తమ మతమునుండి తొలగి పోవలసినది" అనియు
త్తరువు చేసిరి వారిగద్దికి వచ్చినవారి యందఱిలో బా
వానానక్ ప్రవేశించును అని చెప్పుచున్నాడు.

వీరిశిష్య పరంపరలో వారు అల్లుడు వరదక్షిణ యి
చ్చుటలో యేమో కొఱవగలిగి దూషించెనని తనమత
మువారికి కొమార్తెలు గలిగితే చంపివేయుడని యాజ్ఞ
యిచ్చెను. ఈబావానానక్ మతమందు క్షౌరాదులుగూ
డదను నిరుపయోగాంశము లుండినను వారిశిష్యులు కొ
న్నిపిచ్చి యేర్పాటులు చేసినను ఇందలి సారాంశ మేమ
నగా.

## బావానానక్ మతసారము.

జగత్తుకు సర్వశక్తి గలదేవుడొకడే కర్త. కారణా
భిసంధితో నేమతస్థులేరీతిగ నుపాసించినను మంచిదేయ
నియు, హింస చేయకూడదనియు దేవుని సేవించుట వ
ల్లనే, నిహలోక పరలోకములకు సాధనమనియుం జె
ప్పఁబడు, ఇదియె యిందలి సారాంశము.

...❋ మన్మథమతము. ❋...

స్త్రీపురుష జాతి సంయోగము వలన సమస్తభూతి కోట్ల యుత్పత్తి గలుగుచున్నది. యీసంయోగ కారకు డు మన్మథుడు కాబట్టి యితడే ప్రపంచమునకు ముఖ్య కారణము, ఇతని నుపాసించి తదను గుణములయిన స్రి క్చందనాదులు ధరించి యారామ విహారాదులు చేసి మద్యమాంసములు వాజీకరణము లగు రసాయనాదు లు అనగా ధాతు వృద్ధి మందులు, సేవింప వలయు ను. మన్మథ పూజాదులు ముఖ్యముగాను రతిచేయుచు తద్దేవతా మంత్ర పునశ్చరణ చేయ వలయు ననియు నిట్లు, మాన్మథ మతస్థులు చెప్పుచున్నారు.

మన్మధుడు దేవతయైన రతిప్రేరకుడైతే బాలుడు వృద్ధుడు రోగి షండుడు వీరు మన్మథపూజ చేసినంతనే వీరికి కా మోద్రేకము గలుగునా ఆలంకారికులు ఆలంకారిక సమ యమందు మన్మధుడని కల్పించిరి గాని దేవతగాదు.

ఇందుకు ॥ గీ॥ అన్న మదము వలన నతివలు పురుషు లు। నేపులేచి మదను డేచె నండ్రు। అన్నముడుగ వె నుక నత డెందు బోవురా। విశ్వదాభిరామ వినుర వేమ॥ అనియున్నది ఇట్లు లోపము లుండినను ఇందలి సారాం శ ములేవనగా.

## —* మన్మథమతసారము. *—

రతికి నుద్దీపకములైన స్రక్చందనాదులు ధరించుట,వాజీకరణ రసాయనాదులు సేవించుట,రతిముఖ్యము అనుట ఇట్టివి యైహిక సుఖహేతువులు గాన నివి యిందలి సారాంశములు.

## —* ఇతరమతములు. *—

## —* వైశ్వానరవిద్య *—

శిరస్సు తేజోలోకము.సూర్యుడు చక్షుస్సు.వాయువు ప్రాణము.ఆకాశము మధ్యదేహము. ఉదకము మూత్రస్థానము. భూమి పాదములు. వక్షస్థలము వేదిక. దర్భలు రోమములు. హృదయము గార్హపత్యము.మనస్సు దక్షిణాగ్ని.ముఖము ఆహవనీయము. ఇట్టిరూపము గల ప్రాదేశమాత్రుడైన వైశ్వానరుని వైశ్వానర విద్యాపరులు ఉపాసించుచున్నారు.

## —* దహరవిద్య. *—

హృదయకమలమునందుండు రంధ్రములోని యాకాశముదహరమని చెప్పబడును దానిలో సత్యకామాది గుణవిశిష్టుడును మనోమయుడును నగు ఆత్మను దహర విద్యాపరులు ఉపాసించుచున్నారు.

## —※ మధువిద్య. ※—

సూర్యుడు దేవతలకు మధువనియు మధునాడు లనంబడు తూర్పు కిరణములను వసువులును, దక్షిణ మధునాడులనంబడు దక్షిణ కిరణములను రుద్రులును, పశ్చిమ మధునాడు లనంబడు పశ్చిమ కిరణములను ఆదిత్యులును, ఉత్తరమధు నాడులనంబడు ఉత్తర కిరణములను మరుత్తులును, ఊర్ధ్వమధు నాడులనంబడు ఊర్ధ్వకిరణములనుసాధ్యులును అనుభవించుచు నుండెద రని ఇట్టి సూర్యుని మధు విద్యాపరులు ఉపాసించు చున్నారు.

## ...※ ఉపకోసలవిద్య ※...

జాబాలిశిష్యుడగు ఉపకోసలునకు గార్హపత్యాగ్ని సూర్యునిలో నుండు పురుషుని నుపదేశించెను దక్షిణాగ్ని చంద్రునిలో నుండు పురుషుని నుపదేశించెను ఆహవనీయము మెఱుపులో నుండు పురుషుని నుపదేశించెనుఆచార్యుడైన జాబాలుడు అక్షిపురుషుని నుపదేశించి యీయుపాసనలకు ఫలము అర్చిరాది మార్గముచేత బ్రహ్మలోక మని చెప్పెను. ఇట్లు ఉపకోసల విద్యాపరులు ఉపాసించుచున్నారు.

—* పంచాగ్నివిద్య. *—

ద్యులోక పర్జన్యభూమి పురుష స్త్రీలను స్థానపంచకమునందు అగ్నిబుద్ధిచే, పంచాగ్నివిద్యాపరులు ఉపాసించుచున్నారు.

—* శాండిల్యవిద్య. *—

పరబ్రహ్మమును ప్రత్యగాత్మకంటె వేఱుగాదని శాండిల్య విద్యాపరులు ఉపాసించుచున్నారు.

—* అంతరాదిత్యవిద్య. *—

సూర్యుని లోపల హిరణ్మయుఁడుగా జెప్పబడినట్టియు, పురుషుని నేత్రమునందు గనుపడునట్టియు పరమ పురుషుని నొక్కనిగా అంతరాదిత్య విద్యాపరులు ఉపాసించుచున్నారు.

పైజెప్పిన మతములు కార్యకోటిలో జేరిన ప్రపంచ పదార్థములను నుపాసించునవి కావున కారణమైన బ్రహ్మమును ఉపాసించునవి గావు. వీట్లలో సారాంశమేమనగా.

—* ఇతరమతములసారము. *—

వృథాగా కాలమును పుచ్చకయు ఉపాస్యములు

౭సద్విషయములు గాక యుండుటయే వీట్లలో నుండు సారము.

## అష్టదిక్పాలకోపాసకమతములు మొదలగు చిల్లర మతములు.

ఉదకమువలన సమస్త ప్రాణులు బ్రతుకుచున్నారు. ఉదకము మేఘములు వర్షించుట వలన గలుగుచున్నది. మేఘములకు నింద్రు డధిదేవత కాబట్టి ముఖ్యకారణమింద్రు డని కొందఱును, సమస్తప్రాణులకు ఉష్ణమును అనుసరించే ప్రాణము లుండుట వలనను, సర్వపదార్థములను పచనముచేసి భుజించుటకు నుపయోగ పడునట్లు చేయుట వల్లనున్ను - ఆభుజించు పదార్థములు జీర్ణింప జేయుట వల్లనున్ను నిట్టియనేకోపయోగ కరమయినది యగ్నికాబట్టి ముఖ్యకారణము అగ్నియనికొందఱును - సమస్తప్రాణులజంపువాడు గనుక అట్లుచంపక శాశ్వతముగా బ్రతికియుండు ముక్తి నిచ్చుటకు యముడు ముఖ్యము గాబట్టి ముఖ్యకారణము యముడని కొందఱును - అసురుడగు నైరృతి దయయుంటే గాని దుర్విషయము లందు బుద్ధులు పుట్టించ కుండును దీనికి

నైర్రృతిముఖ్యదేవత కాబట్టి ముఖ్యకారణము నైర్రృతియని కొందఱును సమస్తప్రాణాధార మయినది జలము ఇందు వలననే జలమునకు జీవన మనిపేరు. జలమునకు అధిదేవతయుజలరూపుండును వరుణుడు కాబట్టి ముఖ్యకారణము వరుణుడని కొందఱును, శ్వాసరూపక వాయువు ఆదేవతకు ప్రాణులు బ్రదికి యుండేది గనుక మాధ్వులు ఈవాయువే ముఖ్యప్రాణదేవుడని చెప్పుచున్నారు కాబట్టి ముఖ్యకారణమువాయువని కొందఱును, కుబేరుడు ధనాధిపతి, యితని దయయుంటేనే గాని, ధనములభింపదు, ధనము లేక ధర్మార్థ కామమోక్షములు గలుగవు కాబట్టి కుబేరుడు ముఖ్యకారణమని కొందఱును, ఈశానుడు ప్రళయ కర్తయు సమస్తమును నాశముచేయువాడును గనుక తన్నునాశము చేయక యుంచుటకు ముఖ్యదైవము గాబట్టి ముఖ్యకారణము ఈశానుడని కొందఱును ఇట్లు అష్టదిక్పాలకోపాసకులు చెప్పుచున్నారు.

మఱియును సమస్తౌషధులకు రసము నిచ్చువాడు కాబట్టి ముఖ్య కారణము చంద్రుడని కొందఱును, సమస్త భూతములకు ఆధారము గాను అన్నాదులను ఇచ్చుటకు ముఖ్యకారణము గాను ఉన్నందున ముఖ్యకారణము పృథివి యని కొందఱును, ఆకాశము ఉంటేనే గాని

ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఆమటకును ఘాతములు తిరుగ లాడి కదలమెదలుటకును సాధ్యపడదు, కాబట్టి ముఖ్య కారణము ఆకాశమని కొందఱును:

వినాయకుడు సమస్తకార్యములకు విఘ్నముచేయు, దేవత, ఆయనను ఉపాసింపక, యేకార్యసిద్ధియుగాదు, కాబట్టి ముఖ్యకారణము వినాయకు డని కొందఱును జె ప్పుచున్నారు.

ఇట్టి చిల్లరమతములు అనేకములు గలవు, కొన్నిశిథిల పడి పోయియు నున్నవి వీట్లలో నందఱికి దెలియవచ్చు పిచ్చి సంగతులు అనేకములు ఉండినను, ఈచిల్లర మత ములయందలి సారాంశ మేమనగా.

## —※ చిల్లరమతములసారము. ※—

నాస్తికుల వలె దేవుడు లేడని నిర్ణయముగా తమ సుఖార్థముగ లోకబాహ్య కార్యముల యందు ప్రవ ర్తింపక యుండుటయే వీట్లయందలి సారాంశము.

## —※ మనస్సాక్ష్యమతము. ※—

ఈమనస్సాక్ష్య మనగా కొందఱు కాక్ష్యక్ష సేప్ర మాణ మని చెప్పు నట్టిది గాదు. అట్లగు నెడల తనసు ఖార్థముగ ఇతరులకు దుఃఖకర మయిన కార్యములు

తనమనస్సుకు దోచునవియును కాంవ్యన్ను అని చెప్ప వచ్చును.

ఈమనస్వాతన్త్య సిద్ధాంతము అట్టిదిగాదు ఏలనంటె ప్రత్యక్షానుమాన యుక్తి ప్రమాణముల చేతను, తదను గుణ నానామత ఆస్తికశాస్త్రప్రమాణముల చేతను, లోకదుఃఖకరము గానిది గాను, నుండు నీమనస్వాతన్త్య సిద్ధాంతము మిగుల శ్లాఘ్యమైనది. ఇట్లుండవలసినది అను సిద్ధాంతమునకు ॥ మనుః ॥ "ప్రత్యక్షంచాను మానంచ శాస్త్రంచ వివిధాగమం । త్రయం సువిదితంకార్యం ధర్మశుద్ధి మభీప్సతా" ॥ అనియున్నది. ఇంతే గాక కొందఱు శాస్త్రమే ప్రమాణ మని యెంచి జరిపించు చున్నారు. అట్లుశాస్త్రోక్త ధర్మములను గూడ, ముందు సుఖము గలుగ జేయనిదిగాను లోకమునకు వేసట గలుగ జేయునదిగానునుండు విషయము శాస్త్రోక్తమైనను అట్టి ధర్మమును వర్జింప వలయు నని మనువు చెప్పియున్నాడు ॥ శ్లో ॥ పరిత్యజే దర్థ కామౌ యౌ స్యాతాం ధర్మ వర్జితౌ । ధర్మ మప్య సుఖోదర్కం లోక విక్రుష్ట మేవచ ॥ అని యున్నది కాబట్టి సుఖమునుగలుగజేయు అర్థ కామములు ధర్మ రహితములైన యెడల వాటిని విడువవలయు ననియు, తె

నకు సుఖకరము గానిదియు లోకమునకు వేసట గలిగించు
నదియునగు ధర్మము శాస్త్రోక్తమైనను విడువవలసినదని
యున్నది గనుక ప్రత్యక్షానుమాన యుక్తులకు అనుకూ
లమైన శాస్త్ర ప్రమాణములతో జేరినది ఈ మనస్సా
క్ష్యము. ఇందులో దైవం సత్యం అనియు దేవుడు జ
గదను మానాది ప్రమాణములను బట్టియు అదృష్టాధీ
నముగా అయత్నముగా ఫలములిచ్చుటను బట్టియు సి
ద్ధించుచున్నాడనియు, ఆయనకు పరిచ్ఛిన్న రూపములే
దు గనుక దేవుని గుణక్రియా ప్రతిపాదకములై నట్టివి
యు నితర సాధారణములు గానివియు, నయిన నామ
ములచేత స్మరింపదగిన వాడుగాని, యితర విధములుగా
నుపాసింప దగిన వాడుగాడనియు, నుపకారమే దేవుని
ప్రీతికిముఖ్యకారణమనియు, దేవునియొక్క ప్రీత్యప్రీతులను
బట్టిపుణ్యపాపము లేర్పడుచున్నవనియు తన్నేకులములో
పుట్టించినాడో అందువలన తమ తమ సద్ధర్మములను వి
డువగూడదనియు వ్రాయ బడియున్నది "మానంనామం"
అనగా తనమానమునుగాపాడుకొనుటయే తనకునామం
అనగా తన పేరు ప్రతిష్ఠలోకి రావడముభవిష్యత్తుఆలో
చించవలసినది ఎందువల్లనంటే జీవునికి మోక్షముగాని
లోకాంతర జన్మాంతరములుగాని యున్న యెడల తనకు

చెఱుపు గలుగకుండజేసికోవలసినది గాబట్టి భవిష్యత్తు ఆలోచించ వలసినది. ఇందుకు యుక్తి॥ శ్లో ॥ "నాస్తిచేన్నాస్తినోహాని రస్తిచేన్నాస్తికో హతః" ॥ అని యున్నది. అనగా దేవుడు లేనియెడల యున్నాడని చెప్పువానికి హానిలేదు. దేవుడున్న యెడల లేడనువానికి ముందుహాని గలుగుచున్నది.

ఇంతకు దప్పదక్కిన సంగతులు ఎవరునునిశ్చయింప జాలరనియు, ఇట్లు తెలియనందు వలననే సమస్తమత శాస్త్రములలో తత్వములు నానావిధములుగా వ్రాసి యున్నారు.

మఱియు నొక్కొక్క మతశాస్త్రమందే నానావిధములుగా వ్రాసియున్నారు అందున బట్టి యాయామతములవారే పలుతెరంగుల మతభేదములు గల్పించుకొని వాదించుకొనుచున్నారు. ఏలనంటే ఎవ్వరికిని పూర్వజన్మజ్ఞానము లేనందున నున్ను చచ్చి చూచి వచ్చి చెప్పినవారు లేనందునను యిక్కడ కూచుండి తమకు దోచిన ప్రకారముగ శాస్త్రములు గల్పించిన వారు గనుకనున్ను యిన్ని మతభేదము లేపడ్డవి. ఇట్లు విరుద్ధాంశములలో కొన్ని ముఖ్యము లయినవి వ్రాయుచున్నాను.

అంతర్యామి ప్రేరణము లేనిదే యేకార్యము చేయ జాలడనియు తృణముకూడ దేవుని ప్రేరణలేనిదే కదల దనియు గొన్ని శాస్త్రము లందు జెప్ప బడి యున్నది. మనుష్యులకు దేవుడు కొంత స్వాతంత్ర్యమిచ్చినట్లును అందువలన కర్తవ్యా కర్తవ్యాంశములు గలిగి నట్లు ను విధిశాస్త్రముల యందు జెప్పబడి యున్నవి. ఏలనం టే పూర్వజన్మములో మనముచేసికొన్న పుణ్యాపాపము ల వలన ఈజన్మములో రోగారోగ్యములు మొదలయిన వి దేవుడు గలుగ జేయు చున్నాడనియు, నిందు వలన దేవునికి పక్షపాతము లేదను భావముతో జెప్పబడియు న్నవి. దేవుని యిష్టము మీదనే కష్టసుఖములు గలుగు చు న్నవి.

దేవుడు స్వతంత్రుడు సర్వము ఆయనసొత్తు గనుక తనసొత్తును తాను వ్యత్యయము చేయుట వలన పక్ష పాతము దేవునికి రాదని జన్మాంతరము లేదను వారిశా స్త్రములందు జెప్పబడియున్నవి. మంచిది పూర్వజన్మ ములో జేసికొన్న ప్రకారము ఫలములను ఈజన్మములో నిచ్చుచున్నాడని చెప్పుచున్నారే, పూర్వజన్మ వృత్తాంత ము ఎవరికైనను జ్ఞాపకమున్నదా, అట్లులేనప్పుడు పూ ర్వముచేసినవాడొకడు యిపుడు ఫలభోక్త యొకడుగ

నేర్పడి దేవుని న్యాయమునకు విరోధము రాలేదా యనియు జెప్పుచున్నారు.

పూర్వజన్మకృత కర్మంబే ఫలమునిచ్చును దేవునితో నక్కర లేదని కొందఱు చెప్పుచున్నారు.

కర్మంబు, జడముగ క్షణావస్థాయిగ నుండుటం బట్టి, ఆకర్మము కాలాంతరమందు ఆఫలము నీయజాలదని కొందఱు చెప్పుచున్నారు.

యజ్ఞాదులలో హింసాది కర్మంబులు, ధర్మంబులని కొందఱు చేయు చున్నారు. వేదమతమువారే పూర్వము మాంసాదులు తినుచుండిరి, యిప్పుడు కూడదని మానివేసిరి.

ఇట్టివి యనేకములు మార్పబడి యున్నవి యిందువలన పుణ్యపాపకర్మంబు లిట్టివని యేర్పడలేదు, ఉపాస్యదేవతలు ఉపాసనావిధములు మోక్షములు నానా విధములుగా జెప్పుచున్నారు.

మఱియును కర్మ భక్తి జ్ఞానకాండములయందు అనుష్ఠానములు వేలువేలుగా జెప్పబడి చేయు చున్నారు. యిట్టి యనేకము లయిన నిదర్శనముల బట్టి మనముపుట్టక ముందు సంగతియు, చచ్చిన వెనుక సంగతియు, పరోక్షపు సంగతియు, నెంతమాత్రంబును దెలియకవారి

వారి రుచిప్రకారముగ మతశాస్త్రములను వ్రాసికొని రిగావున దేవుని వలన నేర్పడిన శాస్త్రములు గావు.

ఇందుకు నిదర్శనము శాస్త్రములలో ఖగోళము లో గ్రహాదులు మనకన్నులకు దెలియ వచ్చురీతి వ్రాసిరిగాని, నక్షత్రాఫీసులో నుండు నళికా యంత్రముల వలన గానవచ్చు యథార్థ స్థితిని వ్రాయలేదు.

ఈవిషయము మనస్వాతంత్ర్య గ్రంథంబునం దంతట వ్రాయబడి యుండుటేగాక, యుపోద్ఘాతస్తోత్రము నం దును తత్వ ప్రశ్నరూపక ప్రార్థనాశ్లోక వ్యాఖ్యాన మునందును విశేషముగా వ్రాయబడి యున్నది చూ డుడు.

మఱియును జగత్కార్యమును జూచియు అయత్న పూర్వకముగా గలుగు శుభాశుభ ఫలములనుజూచి దీ నికి కర్తయగు సర్వేశ్వరు డుండవలె నని చెప్పుచున్నా రు గదా ? జగత్తు నందుండు పదార్థములకు వేఱువే ఱు కారణములు కనుపించు చున్నవి, కారణ కార్యము లు నశించు నవియే యగును. ఇట్లుండగా నన్నిటికి కా రణమై నిత్యుడై పరిపూర్ణుడై సర్వశక్తిగల దేవుడు ఒక్కడే కారణ మని యెట్లు చెప్పవచ్చును అనియాక్షే పి ంతురు, ఈ ప్రశ్న, రూపనామముతో జేరిన కారణకార్య

ములను బట్టి యెడుగుమాటగా నున్నది. బ్రహ్మము స
ర్వశక్తులు గలవాడు గనుక తన పరాపర ప్రకృతులను
అనగా చిదచిత్తులను మిశ్రముచేసి రూపనామాత్మక
మయిన యీప్రపంచము జేయుచున్నాడు అయితే ప్ర
పంచముయొక్క రూపనామములు అనిత్యములు యిం
దువలననే కారణమయిన బ్రహ్మమునకు ప్రపంచముతో
అన్వయము. అనిత్యములయిన రూపనామములు బ్రహ్మ
ముతో వ్యతిరేకము. కాబట్టి బ్రహ్మప్రపంచములకు అ
న్వయ వ్యతిరేక దృష్టాంతములు భాగవతమునందు జెప్ప
బడియున్నవి. ఇందువలన బ్రహ్మము ప్రపంచమునకు అ
భిన్న నిమిత్తోపాదాన కారణమగుచున్నాడు. కాబట్టి కా
రణానవస్థ రాజాలదు. అయితేయీయనిత్యమయిన ప్ర
పంచమును మాటిమాటికి నెల్లప్పుడును సృజించుచుం
డుటకు నిత్యతయు, నిట్టి శిల్పము కొంచమున్నులేకనే చే
యుటకు సర్వశక్తిస్వరూపత్వమును, యీపరిమితి లేని
ప్రపంచమును సృజింపను బాలింపను సంహరింపను ద
త్తజ్జీవ కర్మణముల నెఱింగి తదను గుణఫలముల నీయ
ను, అప్రాప్తదేశుడుగా నుంటే జరుగదు గావున,పూ
ర్ణుడు గాను, నొక్కడుగాను నుండవలెను.
లేక యీశ్వరులు అనేకులుండ గూడదా యంటే,

భూమిలో ననేకులు రాజులుగా నుండుట చేతనున్ను, ఒక ఖండము లోనే రాజులు మారుచుండుట చేతను న్ను, లేక ఒక్కొక్కసమయమునందు ఒకఖండములోనే యిద్దఱు రాజులుగా, నుండుట చేత నున్ను ఏకవిధము గా జరుగక మార్పులు గలుగుటయు, జనక్షోభంబు ను అన్యోన్య విరోధ జనిత ప్రమాదంబులును, చూచు చున్నాము గదా ? అట్లులేక గ్రహములు నిరాధారము లుగా నుండి తమతమ గతులు తప్పక సంచరించుటయు, ఋతు నిర్ణయములు సముద్రములు మేరమీరి రాకుం డుటయు, ఆయాజాతులయందు నిర్ణీతములుగాక, వి జాతులు పుట్టకుండుటయు, స్థావర జంగమాదులకు వా టివాటి యాయుః పరిమాణాదులు గుణములుమారకుం డుటయు, ఇవిమొదలయినవి పైన జెప్పిన సర్వశక్తులు గల భగవంతు డొక్కడుగా నుంటేనేగాని నెఱవేఱదు, లేకుంటేయనేక వ్యత్యయములు గలుగును.

ఇట్టి ప్రత్యక్షదృష్టాంతముల వలన, మనస్సాక్షికి దే వుడొక డున్నాడని తెలియ వచ్చుచున్నది.

అయితే, ఆయనక్రింది యధికారు లనేకులుండి, ఆయ న నిర్ణయించిన పనులు చేయవచ్చును గాని, అట్లుచే

ప్పటలో ననేక విరోధము లున్నవి. వీరు సర్వశక్తిగల వారుగా నుంటేనే, అంతటూపనులు చేయగలరు. ఆప క్షములో దేవుని వంటి శక్తిగలవారైతే క్రింది అధికారులు తామే అధికారులుగా నొకసమయమందు ఏర్ప డవచ్చును అల్పశక్తులుగా నుంటె పరిమితి లేని ప్రపంచమునకు నెందఱు క్రిందియధికారు లేర్పడ వలయునో యోచించుడు. మఱియు వీరలయజ్ఞానము చేత చేయు పనుల పొరపాటు వలన న్యాయవిరోధము గలుగును నాస్తికులు ప్రపంచమునకు నొకడు అధికారిగా నుండినను కాలాంతరమందు ఆయునకు ఇచ్చవేఱువేఱుగా గలిగితే అప్పుడు మార్పులు గలిగి కష్టములువచ్చును. లేదా అనేకులధికారు లుండినను, పరస్పర తాత్పర్య భేదముల వలనలోకమునకు కష్టము వచ్చును గావున నీప్రపంచమునకు అధికారియుండ నక్కఱలేదు. అంతయుస్వభావజన్యమని చెప్పుచున్నారు. ఇట్లుస్వభావమే కారణమైతే వస్తువులకు వాట్లవాట్లకు అయత్నముగా సంయోగముగలుగుట వలన నొక నిర్ణయంబును లేకయే, జీవాది సృష్టిలేమి వాట్లవాట్ల శక్తులేమి మార్పులగుచునుండ వచ్చును, అట్లు కలుగుటలేదు. మఱియు ప్రపంచపదార్థములు చూచి యోచించగా అనేక ప్రాణులకు

పరస్పరోపయోగములను యోచించి యేర్పఱచినట్లు న్నది, ఇందులో రూపవర్ణ గంధాది గుణములు విచిత్రవైలక్షణ్యములు గలవిగా నున్నవి. అందులో జ్ఞానగుణముగల జంగమ పదార్థములున్నవి. ఇట్లుండునపుడు కేవల జడమైన స్వభావమువలన గలిగిన వనియెట్లు చెప్పవచ్చును. ఈస్వభావము అను సర్వకారణమందు జ్ఞానము కూడా కలిగియున్నదని చెప్పు పక్షమున, మేము చెప్పెడు బ్రహ్మము జ్ఞానేచ్ఛా క్రియాది సర్వశక్తులు గలవాడనియు ఆయనకు స్త్రీత్వపుంస్త్వాది లింగములు గల రూపము లేదనియు, ఆయన సర్వశక్తి గల జ్ఞానపదార్థమనియు జెప్పుచున్నాము గాన మాయాస్తికుల యభిప్రాయములోకే, నాస్తికులు వచ్చిరి గాన జ్ఞానేచ్ఛాక్రియాశక్తులు గల పరిపూర్ణ బ్రహ్మంబు ఒక్కడేయని చెప్పకపోతే ప్రత్యక్షానుమాన ప్రమాణ యుక్తులకు సరిపడదు గనుక "దైవముసత్యము" అనుట ఈమనస్వాత్మ్య మతమందలిసారాంశము.

ఈప్రపంచము నందు అప్పటప్పటి వారివారి జ్ఞాన తారతమ్యములను బట్టి యనేక మతములు గల్పింపబడుచు వృద్ధిబొందుచు మట్టుపడుచు నశించుచు నున్నవి, బుద్ధిమంతు లయినవారు స్వమతాభిమానము నుంచుకొనక

ఇతరమతములు సారము లేనివని తిరస్కరింపక శ్రద్ధతో
జూచి వాట్లలో నుండు సారాంశములు గ్రహించి యి
హపరాదు లందు తనకు సుఖము గలుగు లాగున తా
ననుష్ఠించుట బుద్ధిమంతులకు ముఖ్య లక్షణము గనుక అట్టి
బుద్ధిమంతులకొఱకై యీగ్రంథము వ్రాసినాడను.

గ్రంథము విస్తారముగా వ్రాసిన యెడల చూచువారికి
వేసట గలుగునను భీతితో సంగ్రహముగా వ్రాసితిని.

ఇట్లు యెంత సంగ్రహముగా వ్రాసినను, ఇప్పటి
వారు, కేవలం బ్రహ్మజిజ్ఞాస లేనివారుగాను, అశనశిశ్నా
దుల యుపయోగములు చూచుకొనువారుగాను. లౌకిక
విద్యాగర్వము గలవారుగాను, లేక తత్వజిజ్ఞాసులుగా
నుండినా అనేక మతగ్రంధశోధనలు జేయజాలక, అభ్య
స్తమతాచారాదుల యందు మరిగిన మనస్సుగలవారుగా
ను నుండుటచేత, యీగ్రంథమును అంతగా లోతుకు
దిగి చూడక నిర్లక్ష్యము జేయుదురు.

అయితే తన మతమనే పక్షపాత బుద్ధి నుంచక మన
స్సాక్షితో చూచు నొకానొకరికి యీగ్రంధము తృప్తిని
గలుగ జేయును, అని నమ్ముతాను.

మనస్సాక్షితో యోచించ వలసిన ముఖ్యాంశము.

సమస్త ప్రాణులకు దేవుడు క్షుత్తును వుంచినాడు.

యిందువలన క్షుత్తు నివర్తి చేసుకో వలసినది అవశ్యకము, యిందుకే వకరిని వకరు ఆశ్రయించేది, భవిష్యత్సుఖము కొఱకు ధనార్జనము చేయు చున్నారు;యిదే దృష్ట ప్రక్రియలో తెలియ వచ్చు నది గాన ధనార్జనమునకే పాటు పడుచున్నారు.

వాని వాని తరగతినీ అనుసరించి ధనికుడు,బీదవాడు, దృఢ గాత్రుడు, రోగి, యిట్టి తారతమ్యములు యెట్లుకలిగె, యెవడు గలుగ జేసె, లేక తన యత్న లోపమువలన గలిగినదంటే, అందరు విద్యా ధనములకు పాటు పడే వారేనే, అందరికి లభించ రాదా, యీయనుభవము ను బట్టి సర్వమునకు కర్త యైన దేవుడున్నాడని యోచించు వారికి యాకర్తయైన దేవుని దయ గలుగజేసి కొనవలెనని జిజ్ఞాస గలుగుచున్నది. అట్టివారికి అనగా నేయే మతస్థులు ఎట్లెట్లు తత్వనిర్ణయము జేసికొనిరి. యేదియుత్తమము అని శోధించువారికి యీగ్రంథము చీకటిలో మార్గము వెదకు వారికి కరదీపము వలె సహాయమగును. గాన నింతకష్టపడి ఈగ్రంథము వ్రాసితిని.

ఇందులో ననేక మత రహస్యములు వ్రాయుటలో

కించిత్తుగ పొరపాట్లుండినను గణనలోకి దెచ్చుకోనక యిన్నింటిలో నేను కష్టపడిన గుణగ్రహణమే చేయుదు రని నమ్ముతాను.

సర్వమతసారసంగ్రహము, సంపూర్ణము.

శ్రీకృష్ణపరమగురుభ్యోనమః.



